కాళిదాసు రామకథ : తెలుగు- సోమసుందర్

సోమసుందర్ గ్రంథావళి క్రమసంఖ్య 54

ప్రచురణ : ఆగస్టు, 1999

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్,చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-4

**వెల : రు. 20/-**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,** బ్యాంకుస్ట్రీట్, హైదరాబాద్ - 500 001

ముఖచిత్రం : భద్రాచలం శ్రీరామ దేవాలయ మూలవిరాట్టు

చిత్రరచన : శ్రీమతి లక్ష్మి

**ఈ గ్రంథ ముద్రణకు శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానము వారు ధనసహాయం చేశారు. వారికి రచయిత కృతజ్ఞుడు**

అందరూ తప్పక చదవాల్సిన గ్రంథాలు

1. జీవనలిపి - సంపూర్ణ కావ్యం.
2. సీకింగ్ మై బ్రోకెన్ వింగ్.
3. రక్షరేఖ - కావ్యం
4. దోనా పాలా - కవితా సంకలనం
5. ధూప్‌ఛాయ - కావ్యం
6. నూరు శరత్తులు - వ్యాసావళి
7. శరత్‌చంద్రిక : వ్యాసావళి
8. ఆ తరం కవితా తరంగాలు - సాహిత్యవ్యాసాలు

# అంకితం

శ్రీ వాసుదాసుగారి శిష్యులు

భక్తాగ్రగణ్యులు, నిష్ఠాగరిష్ఠులు

శ్రీ కొత్తపల్లి నారాయణదాసుగారికి

వారి 92వ జన్మదిన సందర్భంలో

శుభాకాంక్షలతో ......... సోమసుందర్

(కవి మిత్రులు శ్రీ కొత్తపల్లి సత్య

శ్రీమన్నారాయణ గారి జనకులు)

# ప్రస్తావన

ఎప్పుడో చిన్నతనంలో పది, పదమూడేళ్ళ నడుమ గురుముఖత: సంస్కృతం నేర్చుకుంటున్నప్పుడు రఘువంశం 3 సర్గలే పాఠం చెప్పారు. తర్వాత స్వయంగా హర విలాసం, మేఘసందేశం చదువుకున్నానేగాని, సంపూర్ణంగా రఘువంశం అధ్యయనం చేసే అవకాశం లభించలేదు. 1990లలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు రెండు భాగాలుగా ప్రచురించిన రఘువంశం లభించింది. అధ్యయనం చేయనారంభించాను.

కవి కులపతి కాళిదాసు రామకథ చెప్పడంలో ఎంతో స్వతంత్రించాడు. ఎన్నో మార్పులు చేశాడు. సంగ్రహంగానూ, హృద్యంగానూ కథనం చేశాడు. దానిని చదువుతున్నప్పుడు లలితమైన తెలుగులో రామకథ చెప్పాలనిపించింది. పూర్తి చేశాను. దీని ముద్రణకు శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానం సంపాదకులు ఎన్.ఎస్. రామ్మూర్తిగారు ఎంతో సహకరించారు.

3 దశాబ్దాలుగా నాకు సన్నిహితులై ప్రియమిత్రులైన దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ క్షీరా రామలింగేశ్వర వినాయక్‌గారు తిరుపతిలో ఉండి విధి నిర్వహణ చేస్తున్న సమయంలో ఈ గ్రంథాన్ని వెలువర్చలేకపోయానన్నదే విచారం.

భద్రాచల మందలి సీతా, రామలక్ష్మణుల మూర్తులకు శ్రీమతి లక్ష్మిగారు ప్రతిరూపం చిత్రించారు. దానిని ఈ గ్రంథం ముఖచిత్రంగా వాడుకుంటు న్నందుకు వారికి కృతజ్ఞతలు.

గతంలో 2 గ్రంథాలను అందంగా ముద్రించిన నాగార్జున ఎంటర్‌ప్రైజెస్ మేనేజరు శ్రీ వై. వెంకటేశ్వరరెడ్డిగారికి ఈ రచయిత హృదయపూర్వక ధన్యవాదాలు.

కవి కులపతి కాళిదాసుని కవితా వైభవాన్ని తెలుగు పాఠకులకు ఆత్మీయంగా అందించాలన్నదే నా కోరిక. నా కోరిక ఎంతవరకూ నెరవేరిందీ రసజ్ఞులైన పాఠకులే నిర్ణయించాలి.

- గ్రంథకర్త

# కాళిదాసు రామకథ

(పరాశర పుత్రుడు వ్యాస మహర్షి కురువంశ చరిత్రను జయేతిహాసంగా పద్ధెనిమిది పర్వాలు రచించాడు. దానికే మహాభారతమనే ప్రఖ్యాతి. కురువంశానికి ముందు ఆర్యావర్తాన్ని పాలించిన రాజవంశాలలో రఘువంశం ప్రసిద్ధమైంది. ఈ రాజవంశం ద్వాపర యుగానికి పూర్వం త్రేతాయుగంలో పాలించినట్లు విశ్వసించ బడుతోంది. ఆ మహత్తర వంశగాథనే మహాకవి కాళిదాసు పద్ధెనిమిది సర్గలలో రచించి, చివరలో ముగింపుగా పంతొమ్మిదో సర్గ రచించాడు. ఎంతో గొప్ప రాజవంశ మైనా అవినీతిపరుని వల్ల ఎలా పతనమైపోతుందో వివరించాడు.

రఘువంశంలో దశమ సర్గ నుంచి దశరథ మహారాజు వృత్తాంతం ప్రారంభమైంది. భారత భూమిపై దేవేంద్ర వైభవంతో దశరథుడు రాజ్యం చేస్తున్నాడు. అతనికి ముని శాప వృత్తాంతమే మరుగున పడిపోయింది. ఎన్ని సంపదలున్నా పితృణం నుంచి విముక్తి కలిగించే పుత్రులు లేని లోటు పీడిస్తోంది. అతని వైభవాన్ని క్రమ్మేస్తున్న శోకాంధకారాన్ని తొలగించే పుత్రజ్యోతులు లభించలేదు. అదే అతని దిగులు! అదే అతని కన్నుల చీకటి! అనవరతం అదే అతని మనసును పీకుతోంది!

పూర్వమే దశరథుడు శాంతాదేవిని పెంచుకున్నాడు. ఋష్యశృంగునికిచ్చి వివాహం చేశాడు. అతడు మహామహిమాన్వితుడు. ఒకనాడు అతనికి తన మనసులోని బాధ తెలిపాడు. తన ఆధ్వర్యంలో పుత్రకామేష్ఠి అనే యజ్ఞం చేయమని సలహా యిచ్చాడు.

అదే సమయంలో పులస్త్యుని మనుమడు రావణాసురుడుగా సర్వజనులనూ పీడిస్తున్నాడు. దేవతలు నిస్తేజులయ్యారు. ఛాయావృక్షంగా గోచరించిన మహావిష్ణువు అండచేరి మొరపెట్టుకున్నారు. అప్పుడే యోగనిద్ర నుంచి మేలుకొన్నాడు విష్ణువు. ఆ మహాదేవుని ప్రార్థించి తమ ఇక్కట్లు తెలుపుకున్నారు. ప్రసన్నుడైన విష్ణువు ఇలా అన్నాడు: "ఆ రావణుడు ఇంద్రాదులకే కాదు నాకున్నూ శత్రువే! వాడు ఘోరతపస్సు చేశాడు. తన తలలను హోమం చేశాడు. బ్రహ్మ దయకు పాత్రుడై కోరిన వరమల్లా పొందాడు. దానితో మితిమీరిన గర్వం ఆవహించింది. నిరాఘాటంగా వర్తిస్తున్నాడు. చందన వృక్షపరిమళాన్ని ఆకర్షించి సర్పాలు దాని కొమ్మలకెక్కినట్లుగా తయారయ్యాడు. వాడికి త్వరలోనే కాలం మూడుతుంది. మానవులు వాడికి

లెక్కలేదు. మానవులు తప్ప మిగిలిన ఎనిమిది జాతుల చేతనూ చావు లేకుండా వరం పొందాడు. దశరథుడు పుత్రకామేష్ఠి యాగం చేస్తున్నాడు. నేనతని కుమారునిగా రామునిగా జన్మిస్తాను. రావణ సంహారం చేస్తాను. మీరభయులు కండి. మీ నెలవులకు పొండి. సుఖంగా జీవించండి!" అని దీవించాడు.

వెంటనే శ్రీమహావిష్ణువు బయల్దేరాడు. దశరథ పుత్రునిగా అవతరించ పూనుకొన్నాడు. దేవతలంతా తమ తమ అంశలతో సుగ్రీవాది వానరులుగా జన్మించారు. సమరంలో రాముని సహాయార్థం ఆయత్తమయ్యారు. చెట్లు కదలక పోయినా పుష్ప పరిమళ రూపంలో గాలి వెంట ప్రయాణం చేసినట్లుగా వుందని కాళిదాసు ఉపమించాడు.

ఇలాంటి గొప్ప ఉపమాలంకారాలు అవలీలగా అతని కవిత్వంలో పుష్కలంగా కన్పిస్తాయి. కనుకనే 'ఉపమా కాళిదాసస్య' అని కీర్తింపబడ్డాడు.)

★ ★ ★ ★

అయోధ్యలో దశరథుడు పుత్రకామేష్టి శ్రద్ధాభక్తులతో జరుపుతున్నాడు. యాగం ముగియబోతున్నది. సరిగ్గా అదే సమయంలో విష్ణువు క్షీరసాగరం నుంచి అంతర్ధాన మయ్యాడు. పాలలో ప్రవేశించాడు. ఆ పాలు నింపిన హేమపాత్రను చేతనిడుకొని, ప్రాజాపతః పురుషుడు హోమాగ్ని నుంచి ఆవిర్భవించాడు. ఋత్వికులెప్పుడూ ఇలాంటి వింత చూసి ఉండలేదు. సభాస్థాలంతా ఆశ్చర్యమగ్నులయ్యారు. హేమపాత్రలో పాయసాన్నం బరువుగా వుంది. యజ్ఞపురుషుడా పాత్రను రెండు చేతులా భద్రంగా ధరించాడు. వెలుపలికి వచ్చాడు. దశరథుని సానునయంగా చూశాడు. ఆనందంతో పరవశిస్తున్న దశరథుని చేతులలో ఉంచాడు. సకల భువనకారకుడైన ఆదివిష్ణువు దశరథుని కుమారునిగా జన్మించ కోరుకొనడం - అతని తపఃఫలమేనని ఋషులంతా కీర్తించారు.

ఈ పాయసాన్ని తన భార్యలు ముగ్గురికీ పంచడంలో వాల్మీకి తెలిపిన దానికి భిన్నంగా కాళిదాసు చమత్కారంగా ఊహించాడు. పాయసంలో అర్ధభాగం కౌశల్యకిచ్చాడు. మిగిలిన సగంలో సగం కైకేయికి ప్రసాదించాడు. శేషించిన భాగాన్ని సుమిత్రకి యిచ్చాడు - అని వాల్మీకి చెప్పాడు. కాని కాళిదాసు పాయసాన్ని ముందుగా కౌశల్యకు, కైకకూ చెరో సగభాగమూ సమానంగా పంచియిచ్చాడు. వారిరువురినీ తమ ప్రసాదంలో కొంత కొంత సుమిత్రకు పంచమని కోరాడు. దశరథునికి గల ప్రత్యేకాభిమానంవల్ల పట్టమహిషితో సమానంగా గౌరవించినట్లు కాళిదాసు ఔచిత్యం కోసమే మార్చాడు. రాముని భవిష్యత్కథ అంతా కైకేయి పైనే ఆధారపడింది. అదిన్ని సూచితమైంది. కౌశల్య, కైకేయి లిరువురి నుంచి పరిగ్రహించి నందువల్ల సుమిత్రకు ఇరువురు కుమారులు జన్మించారు. కౌశల్య, కైకేయి స్నేహభావంతో సపత్నీ ద్వేషరహితంగా

సుమిత్రను గౌరవింపాలని కూడా దశరథుడు ఉద్దేశించాడు. ఆయన మనోభావాలు గ్రహించిన పత్నులిద్దరూ ఆనందంతో తమకు లభించిన ప్రసాదం నుంచి చెరిసగమూ సుమిత్రకు పంచారు. అందువల్లనే రామలక్ష్మణులకు దగ్గరి పోలికలేర్పడ్డాయి. భరత శత్రుఘ్నులకు దగ్గరి పోలికలు కలిగాయని కాళిదాసు కల్పన.

ప్రథమ స్థానంలోనే కౌశల్యతో సమానంగా పాలుపంచుకున్నందువల్లనే భరతుడు ధార్మిక చింతనలో రామునికెంత మాత్రం తీసిపోని రీతిగా పెరిగాడు. వాల్మీకికి భిన్నంగా కాళిదాసు చేసిన పంపకం ఔచిత్యవంతమని మల్లినాథసూరి సమర్థించాడు.

ఈ పంపకంలో మరొక చమత్కారం ఉంది. పట్టమహిషి కౌశల్యపట్ల దశరథునికి అమిత గౌరవం, ప్రియకాంతగా కైకేయిపట్ల అమితానురాగం. కనుక వారిరువురికీ ప్రథమ స్థానం యిచ్చాడు. సుమిత్ర, సార్థకనామధేయ, గుణశ్రేష్ఠ. మహారాజు కామెపట్ల ఎంతో గౌరవముంది. ప్రత్యేక స్థానమిస్తూ ఇరువురి నుంచి వాటాల నిప్పించి ఆదరించాడు. పెట్టే పెద్దరికం కూడా వారిరువురికీ దక్కింది. రెండు వాటాలు పొందిన ప్రత్యేకత సుమిత్రకూ దక్కింది. ఆ విధంగా దశరథుని దక్షిణ నాయకత్వం సార్థక్యం పొందింది.

దైవదత్తమైన ఒకే పాయసాన్ని ముగ్గురు రాణులూ స్వీకరించడం వల్ల రామాదులు సంఖ్యకు నలుగురే కాని గుణగణాలలో ఏకత్వంతోనే భాసించారు. రాణులు ముగ్గురూ గర్భవతులయ్యారు. వారి గర్భముల నుంచి అవతరించబోయే తేజోమూర్తులు రఘువంశ శోభాప్రదాతలు. వారి అవతరణ వల్ల ప్రజాభ్యుదయం కలుగుతుంది. మహోష్ణ కిరణుడైన సూర్యునిలో సైతం కొన్ని అమృత కిరణాలుంటాయి. అవే వర్ష కారకాలవుతాయని మన పెద్దల విశ్వాసం. అట్టి అమృత కిరణాలే రామాదులు. రఘువంశ తేజోరాశి నుంచి ఉద్భూతులు కానున్నారు.

గర్భవతులైన రాణులు కొత్త దేహకాంతితో మెరుస్తున్నారు. విష్ణ్వంశతో పునీతమైన పాయసం భుజించి గర్భవతులైన రాణులకు స్వప్నంలో శంఖచక్రగదాదులు ధరించిన బాలవిష్ణువే దర్శనమిస్తున్నాడు. వారు ఆనందంగా, నిర్భయంగా కాలం గడుపుతున్నారు. మరోమారు - కౌశల్యాదులకు స్వప్నంలో బంగరు రెక్కల గరుత్మంతుడు దర్శనమిచ్చాడు. అతని రెక్కల కాంతులు గగనభాగాన్ని మెరిపిస్తున్నాయి. మహావేగంతో తమకేవో సుందర లోకాల సందర్శనం కలిగిస్తున్నాడు.

మరొక కలలో శ్రీలక్ష్మి పద్మములతో చల్లగా విసరుతోంది, సేవలు చేస్తోంది. చివరి స్వప్నంలో రాణులు తమ గర్భాలలో బ్రహ్మపదార్థాన్నే పెంచుతున్నట్లు భావించారు. ఇదంతా కాళిదాసు కల్పనే.

సప్తఋషులు ఆకాశగంగా స్నానం చేసి తమ సన్నిధి కేతెంచు తున్నారు. ఉపనిషత్సారం వినిపిస్తున్నారు. ఈ క్రమంలో వారి స్వప్నాలోకనం భౌతిక స్వరూపం నుంచి పెరిగి, అధిభౌతికా నందం పొందాయి. సుగుణానుభవం నుంచి అభ్యుత్థానమై బ్రహ్మానుభవాన్ని పొందు తున్నాయి.

ఈ పరిణామ సూచన యావత్తు కాళిదాసు కల్పించిందే!

ఈ స్వప్న వృత్తాంతాలు రాణులు చెప్పగా మహారాజు విని సంతోషంతో ఉప్పొంగిపోయాడు. తన జన్మ ధన్యమైందని తృప్తి పొందాడు. ఒకే విష్ణువు నాలుగంశలతో ముగ్గురు రాణు గర్భాలలో పెరుగుతున్నాడు. ఒకే చంద్రుడు భిన్న భిన్న జలాలలో తన ప్రతిబింబంతో తానే జలమగ్నుడై అనేక చంద్రులుగా దర్శనమిస్తున్నట్లుగా ఉందని కాళిదాసు వర్ణించాడు. తెలుగువారి ప్రియతమ కవి పోతన - "ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు" అంటూ చెప్పిన పద్యం ఈ సంస్కారంతో వెలువడిందేనేమో!

రాణుల గర్భస్థ శిశువులు శోభస్కరంగా పరిపక్వత నందుకున్నారు. పదవ నెల చొరబడింది. అంతవరకూ రాణులు పాపం తాము గొడ్రాళ్ళమనుకుంటూ పొందుతున్న వేదనల చీకటి పటాపంచలయ్యే రీతిగా కుమారులుదయించారు. తల్లిదండ్రుల దుఃఖ తమస్సులనే కాదు లోకమునందలి అజ్ఞానాంధకారాన్ని సైతం దూరం చేయడానికే అవతరించిన కారణజన్ములు! కౌశల్యానందనుడు సర్వులకు అభిరాముడై సౌందర్య తేజంతో ఆనందాన్ని ప్రసాదించగలవాడు. అతనికి రామునిగా దశరథుడు నామకరణ చేశాడు. పూర్వపురుషులను, సర్వజనులనూ రమింపచేయు శక్తిమంతునిగా ఆశించి రామ శబ్దవాచ్యునిగా చేశాడు. ఆ శిశువే రఘువంశ ప్రదీపకునిగా ప్రకాశించాడు. పురటాలుగా కౌశల్య శాతోదరిగా కనిపించింది. శరదృతువులో గంగా ప్రవాహం సన్నగిల్లుతుంది. ఇసుక తిన్నెలేర్పడతాయి. అప్పుడు కమలాలు తెచ్చి గంగకు పూజ చేస్తారు. ఆ పూజ చేసిన కమలాలు తీరములందలి పులినస్థలిలో మిగిలిపోతాయి. సరిగ్గా అలాగే కృశించిన గంగవలె కౌశల్యా, ఆమె దాపున పొత్తిళ్ళలో పద్మముఖుడైన బాల రాముడూ బొమ్మ కట్టినట్లు కనిపిస్తున్నారు. ఇదీ కాళిదాసుని వర్ణనాస్వారస్యం!

కైకేయి గర్భముక్తాఫలంగా భరతుడు జననమందాడు. ఈ సందర్భంగా వాల్మీకి చెప్పిన క్రమాన్ని కాళిదాసు మార్చాడు. దశరథుడు దేవతా ప్రసాదమైన పాయసాన్ని పంచియిచ్చిన క్రమంలోనే సంతానోత్పత్తినీ క్రమీకరించాడు. వాల్మీకి శ్రీరాముని తర్వాత లక్ష్మణుడే కాక భరతుడూ పుట్టినట్లు పేర్కొన్నాడు. ఆ పద్ధతిని కాళిదాసు అంగీకరించలేదు. సుమిత్రాదేవి ఇటూ కౌశల్య నుంచీ అటు కైకేయి నుంచి రెండు భాగాలందుకుంది. అందువల్లనే ఆమెకు కవల బిడ్డలుగా లక్ష్మణ శత్రుఘ్నులు జననమందారు.

పరిపూర్ణ విద్య ద్వారా లభించిన తత్త్వజ్ఞానం వలె ఈ సంఘటన వికసించిందని కవి వర్ణించాడు. దశరథనందనులు ఉదయించినది మొదలు దేశం సుభిక్షంగా ప్రవర్థిల్లింది. రోగాదులుగాని, ద్వేషాదులుగాని లేకుండా ప్రజలు సుఖమయ జీవితం గడుపుతున్నారు.

అదే సమయంలో రావణుని దుష్ప్రభావం మితిమీరుతోంది. దశదిశలా రావణునివల్ల భీతితో లోకం కంపించిపోతోంది. మహాతేజస్వి సూర్యుణ్ణి ప్రీతి హోత్రుడ్ని సైతం పరాభవిస్తున్నాడు. ఆ దుష్టుని త్వరలో వధించేందుకు శ్రీహరి భూమిపై అవతరించాడన్న ఆశ ప్రదీప్తమవుతోంది. సన్నని సంతోషం ప్రసరిస్తోంది.

అగ్ని దుఃఖ ధూమాలను పోకార్చుకుని వెలుగు లీనుతోంది. రావణ రాజ్యలక్ష్మి హృదయం శోకాకులితమవుతోంది. రావణుని కిరీటమందలి తేజస్విత మణులు ఆకస్మికంగా రాలి నేలబడ్డాయి. అదొక అపశకునంగా అందరూ శంకించారు.

అదే సమయంలో రావణునికి సైతం పుత్రోదయమైంది.

రామాదుల జననంతో ఆనందపరవశులైన దేవతలు దుందుభీ తూర్యరావాలు మ్రోయించారు.

ఇటు సాకేత నగరం సంతోషోత్సవాలలో మునిగితేలుతోంది. దశరథుని రాజప్రాసాదం అలంకరింపబడుతోంది. గుమ్మాలకు మామిడాకుల తోరణాలు కట్టారు. ప్రధాన ద్వారాల కిరువైపులా గెలల వేసిన అరటి చెట్లను నిలిపారు. రకరకాల పూలదండలతో అలంకరించారు. సేవకులంతా నిమిషం తీరికలేకుండా చకచక సాగిపోతున్నారు.

కల్పద్రుమ సంతతులైన పుష్పాలు అప్రయత్నంగా వికసిస్తున్నాయి. పరిమళాలు వెదజల్లుతున్నాయి.

దశరథ కుమారులకు జాతకకర్మలు సవైదికంగా జరుగుతున్నాయి.

రామాదులు దినదిన ప్రవర్ధమాను లవుతున్నారు. సద్గురువుల శిక్షణలో సహజ తేజస్సు ప్రజ్వలితమైనట్లున్నది. అన్నతమ్ములు నలుగురూ ఏక వాక్యంగా పురోభివృద్ధి చెందుతున్నారు. ప్రఖ్యాత రఘువంశ కీర్తికి పతాక సన్నిభులై ప్రకాశిస్తున్నారు. నలుగురూ సమాన ప్రేమాభిమానాలు కలవారే! అయినా రెండు జంటలుగా పరస్పరానుబంధం పెంచుకుంటున్నారు. రామలక్ష్మణు లొక జంట, భరతశత్రుఘ్ను లొక జంట.

కాళిదాసు దీనిని చక్కగా సమర్థించాడు. కౌశల్య యిచ్చిన పాయసాన్ని స్వీకరించగా పుట్టినవాడు లక్ష్మణుడు. కనుక సహజంగా రాముని యందు మిక్కిలి ప్రీతి చూపుతున్నాడు. కైకేయీ ప్రసాదిత పాయస భాగాన్ని స్వీకరించడంవల్ల జన్మించిన శత్రుఘ్నుడు భరతునిపట్ల ప్రీతితో మెలగుతున్నాడు. మొత్తానికి నలుగురి ప్రేమబంధం అవిచ్ఛిన్నంగా పెంపొందుతోంది. ఇది ఆగర్భస్నేహమే. సహజమే. అంతరానుబంధమే. చోదక శక్తిగా రెండు జంటల్లూ అరమరికలు లేకుండా పెరుగుతున్నాయి.

అగ్ని వాయువుల పరస్పరానుబంధ మొకప్రక్క, చంద్ర సాగరాల రాగబంధ మొకవంకా- ఈ రెండు జంటల స్నేహాన్ని సహజ విద్యోతక మొనరిస్తున్నాయి.

బాలురైన ఆ రాజకుమారులు సామాన్య ప్రజలపై అభిమానంతో నగరంలో సంచరిస్తున్నారు. ప్రజలతో కలిసి మెలసి మెలగుతున్నారు. శ్యామాభ్ర వీక్షణానుభూతి జనుల కనులకు కలిగిస్తున్నారు. చతుర్విధ పురుషార్థాలు వేరు వేరుగా మూర్తులుగా రూపొందారా అన్న భావం దశరథునికి కలుగుతోంది. నలుగురూ నాలుగు మహా సముద్రాల వలె తమలో గల సద్గుణ రత్నరాశులను వినమ్ర శీలంతో గుప్త పరచుకుంటున్నారు. జననీ జనకుల కానంద మందిస్తున్నారు. సకల మహిమాన్వితులై క్రమంగా ఆరంభ యౌవన శ్రీలందుకుంటున్నారు.

బాల్యమును వీడి యౌవనవంతులవుతున్న రామాదులు లోకులకు ఆనందప్రదు లవుతున్నారు.

అదే సమయంలో విశ్వామిత్రుడు ఆగమించాడు.

దేహి అని సమీపించిన వారికి ప్రాణములైన సమర్పించడం ఆ వంశ సంప్రదాయంగా కీర్తి పొందింది. విశ్వామిత్రుడు కోరగానే రామ లక్ష్మణులను - ఆ ముని యాగ రక్షణార్థం పంపడానికి అంగీకరించాడు రాజు. దేవకార్యార్థమై కౌశిక మహర్షితో వెళ్ళవలసిందిగా రామ లక్ష్మణుల కాజ్ఞాపించాడు. పిత్రాజ్ఞకు మారు పలకక వారు ప్రయాణ సన్నద్ధులయ్యారు.

తండ్రి పాదాలకు నమస్కరించారు. దశరథుని నేత్రాలు బాష్ప మౌక్తికాలను కురిశాయి. వాత్సల్య పూరితాలయిన పితృపాదుల అశ్రుబిందువులు తమ తలలపై రాలగా ఆయన ముఖం చూస్తూ ధనుర్ధారులై మహర్షి వెనుక నడవనారంభించారు. నగరవాసుల కన్నులు కలువపూవుల దండలై వారి మార్గాన్ని అలంకరించాయి.

రామ లక్ష్మణులకు ఏ యితర సైనిక సహాయమూ అక్కరలేదని విశ్వామిత్రుడు విశ్వసనీయంగా పలికాడు. దశరథుడు వినమ్రుడై ఆమోదించాడు. మహర్షి ఆశీర్వాదమే తన పుత్రులకు రక్ష కాగలదని విశ్వసించాడు.

విశ్వామిత్రుడు సూర్య తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. రామ లక్ష్మణులా మధు మాధవులవలె మహర్షిని అనుసరిస్తున్నారు. వారు యౌవనవంతులయ్యారేగాని బాల్య చాపల్యమింకా విడువలేదు. ఏదో ఉత్సాహం దందడించగా, చేతులు విసురుతూ మంచి ఫూహతో నడుస్తున్నారు. తొలకరి మబ్బుల వలె వేగోత్సాహ గమనులవుతున్నారు. చంద్రకాంత శిలలు పరచిన రాజసౌధంలో తిరిగే మృదుల సుకుమార పాదాలు కరకు రాళ్ళబాటపై సునాయాసంగానే సాగుతున్నాయి.

వారికి విశ్వామిత్రుడు బల, అతిబల అనే మంత్రవిద్యలు ఉపదేశించాడు. వాని మననంవల్ల దారిలో రాళ్ళ మొరటుతనం వారిని బాధించలేదు. సకల భోజనాదులు సమకూరకపోయినా తల్లులచెంతనే ఉన్నంత నిర్భీతిని ఆ ముని కలిగించాడు. ఆ యువకులకు మార్గశ్రమ కలుగకుండా పూర్వగాథల నెన్నింటినో వారికి చెబుతున్నాడు మహర్షి! ఆ గాథలు వారికి గగుర్పాటు కలిగిస్తున్నాయి. దారిలో ఎదురైన సరస్సులలో మంచినీరు త్రాగుతున్నారు, దాహం తీర్చుకుంటున్నారు.

పక్షుల కలకలారావాలతో వనసీమ ఆనందకోలాహలంగా అలరారుతోంది. చెట్లు పరిమళభరిత పుష్పాలను వికసిస్తున్నాయి. చల్లని సువాసనలు వెదజల్లుతున్నాయి. చెట్లు లేనిచోట నల్లని మేఘపంక్తి సూర్యరశ్మి తగలకుండా చల్లని నీడగొడుగులు పడుతున్నాయి.

రామ లక్ష్మణుల సన్నిధిలో ప్రకృతి పులకిస్తున్నది. మార్గమధ్యంలో అప్రయత్నంగా వారి దర్శనం లభించిన మునుల కనులు కర్పూరకళిక లద్దుకుంటున్నాయి. వారిని స్పర్శించిన గాలి క్రొంబులకలెత్తుతున్నది. ధనుర్ధారిగా రాముడు మదనసుందరుడై భాసిస్తున్నాడు. మునులు అచ్చెరువందుతున్నారు.

ఇంతలో వారు తాడక (తాటకి) అనే రక్కసి సంచరించే చిట్టడవిని సమీపించారు. "ఆమె నిరంతరం మునులనే భక్షిస్తూ ఉంటుంది. అందునా పురుష మాంసం తినడం ఆమె కెంతో యిష్టం. మీరు సంసిద్ధంకండి" అని హెచ్చరించాడు విశ్వామిత్రుడు. రామ లక్ష్మణులు ధనుస్సులను నేలపై మోపి నారులు బిగించారు. నారులు లాగి ధ్వనింపచేశారు. ఆ ధనుష్టంకారం ధ్వని తరంగితమై అడవిలో ప్రతిధ్వనించింది. మాగన్నుగా మత్తులో వున్న తాటకి మేలుకుంది. నరవాసన నోరూరించింది. దానితో కోపం పెచ్చరిల్లింది. నల్లని పాషాణ కాంతిలో భయంకర శరీరంతో నరమాంస దుర్వాసనలతో మబ్బుక్రమ్మిన చందాన వినువీథిలో ఆమె ప్రత్యక్షమైంది.

దాని వేగానికి చెట్లు అల్లల్లాడిపోతున్నాయి. కొమ్మలూ రెమ్మలూ రాలిపడుతున్నాయి. సుడిగాలిలా పెద్ద శబ్దం చేస్తూ రామ లక్ష్మణులను సమీపిస్తోంది. తమను మ్రింగడానికి చేతులెత్తి నోరావలించింది. మీదికి వస్తున్న తాటకిపై రామ లక్ష్మణులు ఏకకాలంలో శర ప్రయోగం చేశారు. దాని ఆకతాయితనం వారికి సహించరానిదిగా తోచింది. రాముని బాణం తాటకి వక్షస్థలాన్ని చీల్చింది. దూసుకుపోయింది. లక్ష్మణుని బాణం దాని శిరస్సును నడుమకు రెండుగా చీల్చింది. తాటకి పెనుబండరాయివలె నేలకూలింది.

"ఇది ప్రథమ రాక్షసవధ నాయనలారా! ఇంకా ఎందరో రాక్షసులను వధించవలసి వుంది" అంటూ ఆశీర్వదించాడు విశ్వామిత్రుడు.

బాణాఘాతంతో నేలకూలిన తాటకి శరీర భారంతో వనప్రదేశమంతా క్రక్కదలి పోయింది. చెట్లూ గుట్టలూ కంపించాయి. ఆమె పరివారం భయభ్రాంతులై నలుముఖాల పరుగులు తీశారు. తాటకవధ వార్త విన్న రావణుని మనసులో గూఢంగా భయం ప్రవేశించింది.

కాష్ఠములచే ప్రజ్వలితమయ్యే అగ్ని ఇనుమును కరిగిస్తుంది. కరగిన ఇనుము చల్లారే వరకూ ప్రవహిస్తుంది.

తాటకి వధ కరిగిన ఇనుమువలె ప్రవహించి రాక్షసుల హృదయాలలో ఘనీభవించ నారంభించింది. భయావేశాల వృద్ధిచేస్తోంది.

అప్పుడే విశ్వామిత్రుడు 'రాక్షసఘ్న'మనే మంత్రం ఉపదేశించి రామ లక్ష్మణులకు అస్త్రాలు అందించాడు. దానివల్ల ఇనుము కూడ భస్మం కాగలదని మహర్షి వివరించాడు.

విశ్వామిత్రుని కథాకథన చాతురివల్ల చిన్నవారికి పథిశ్రమ బాధించడంలేదు. అనతి కాలంలో వామనాశ్రమానికి వచ్చారు. శ్రీరాముని మదిలో అజ్ఞాత సంస్కారమేదో కదిలింది. సంతోషోద్వేగాలు ఉత్సహించాయి. శిష్యవర్గ పరివేష్టితమై పల్లవ పుటాంజలిబద్ధమై సుందర ప్రశాంతమైన వామనాశ్రమం వారికి నయనప్రీతి కలిగించింది.

మరల వారు నడక సాగించారు. జాము పొద్దెక్కింది. విశ్వామిత్రుని ఆశ్రమం చేరుకున్నారు. యాగం కోసం శిష్యులు అన్ని యేర్పాట్లు చక్కగా పూర్తిచేశారు. ముని రాకకై నిరీక్షిస్తున్నారు. విశ్వామిత్రుడు యజ్ఞదీక్షితుడయ్యాడు. రామ లక్ష్మణులు సూర్య చంద్రులవలె ఒకరి తర్వాత

ఒకరుగా జాగరూకులై, యాగ రక్షణ కావిస్తున్నారు. రాక్షస విఘ్నాలనుంచి ఆశ్రమాన్ని కాపాడుతున్నారు.

ఇంతలో యజ్ఞవేదికపై పెద్ద పెద్ద నెత్తురు బిందువులు స్రవించనారంభించాయి. ఆ జుగుప్సాకర దృశ్యం చూసి ఋత్వికులు కంగారుపడ్డారు. యజ్ఞవేదిక రక్తమయం కాగానే రాముడు బాణం ఎక్కువపెట్టి ఆకాశమార్గం పరీక్షించాడు. గ్రద్దల రెక్కలవలె రెపరెప లాడుతున్న జండాలతో రథమొకటి మబ్బులలోంచి సాగడం కనిపెట్టాడు. అది రాక్షస సైన్యంతో క్రిక్కిరిసి వుంది.

సైన్యాధిపతులు మారీచ సుబాహులే అయివుంటారని గ్రహించాడు. తన అస్త్రశస్త్రాలను వారిపైకి గురిపెట్టాడు. మిగిలిన అల్పులను ఉపేక్షించాడు. గరుత్మంతుడు మహా సర్పాన్ని వేటాడతాడుకాని చిరుచేపల్ని, నత్తల్ని పట్టడు గదా! వీర సహజగుణమే సైన్యాధిపతుల నన్వేషింపచేసింది. ఆ రాక్షసుల రథం ఆకాశపథంలో మహా వేగంగా సాగుతోంది. అంతకన్నా త్వరమాణమైన వాయువ్యాస్త్రాన్ని రాముడు సంధించాడు. అది సుబాహు గుండెల్ని చీల్చింది. వాడు పర్వతాకారంతో నేలకూలాడు. పండుటాకును రాల్చిపడవేసినంత సులువుగా ఆ అస్త్రకోవిదుడు సుబాహుని పీడ వదిలించాడు. మారీచుడు మాయోపాయంతో భూమికి దిగాడు. దొంగచాటుగా ఆశ్రమవనంలో ప్రవేశించాడు. నక్కి నక్కి సంచరిస్తున్నాడు. అది కనిపెట్టాడు రాముడు. అనేక బాణాల నొక్కపెట్టున ప్రయోగించి వాడి శరీరాన్ని తుత్తునియలు చేశాడు. ఆశ్రమానికి దూరంగా ఆరుబయట పడేటట్లుగా మరో శస్త్రం సంధించాడు. అలా వాడి శరీర శకలాలను పక్షులకు ఆహారంగా పడవేశాడు.

శాస్త్రవ నిష్కంటకమైంది. విశ్వామిత్రుని యాగం భద్రంగా సాగింది. ఋత్వికులు నిర్భయంగా నిర్వర్తించడం వలన యజ్ఞం నిర్విఘ్నంగా విజయవంతమైంది. ఆ మహర్షి నదీ స్నానం చేసి వస్తున్నాడు. ఎదురేగిన రామ లక్ష్మణులు అతని పాదాలకు నమస్కరించారు. వారి తలలపై పవిత్రోదకంతో కూడిన కుడిచేయి అన్చి మృదువుగా నిమిరాడు. తన ప్రేమనూ, సంతోషాన్నీ తృప్తిగా వ్యక్తంచేశాడు. తన యజ్ఞం పరిసమాప్తినందిన సంతృప్తితో విశ్వామిత్రుడు సుఖోచ్ఛ్వాసాలు తీసుకుంటున్నాడు. అదే సమయంలో మిథిలా నగరం నుంచి వార్తాహరులు వచ్చారు. జనక మహారాజు వర్తమానం పంపాడు. తాను తలపెట్టిన యజ్ఞానికి ఆహ్వానించాడు.

లోకప్రసిద్ధమైన శివధనువు జనక మహారాజు దగ్గరున్నదని రాముడు విన్నాడు. దానిని చూడాలని చాలాకాలంగా కుతూహలం పొందుతున్నాడు. రాముడు తన మనోభావాలను అభివ్యక్తం చేయలేదు. విశ్వామిత్రుడు గ్రహించాడు. తనతో రామ లక్ష్మణులిరువురిని మిథిలకు రావల్సిందిగా కోరాడు, తోడ్కొనివెళ్ళాడు.

వారు ముగ్గురూ నడక సాగిస్తున్నారు. సాయం సంధ్య సమీపించింది. అనతి దూరంలోనే గౌతమ మహర్షి ఆశ్రమం కనిపిస్తోంది. చల్లని నీడలు ప్రసరిస్తోంది. పుష్ప సుగంధాలు వెదజల్లుతోంది. వారు గౌతమాశ్రమం ప్రవేశించారు. ఒక వృక్షచ్ఛాయలో శుభ్రమైన ప్రదేశాన్ని ఎన్నుకొని విశ్రాంతి తీసుకున్నారు.

ఇంద్రుడు అహల్యాభోగం చేసిన గౌతమాశ్రమ ప్రదేశమదే. గౌతమ మహర్షి తీవ్ర తపస్సులో నిమగ్నమై వున్నాడు. ఆశ్రమం శుభప్రదమై శోభిస్తోంది - అని కాళిదాసు వర్ణించాడు. అహల్య చేసిన పాపం నుంచి నిష్కృతి పొందే వరకూ ఆ చోటనే పాషాణమూర్తిగా పడివుంది. ఆ కథ చెప్పి విశ్వామిత్రుడు ఆ శిలామూర్తి వద్దకు రాముని కొనిపోయాడు. సౌందర్య లావణ్యమూర్తిగా అహల్య తన పూర్వ స్వరూపంతో మేలుకుంది. ఈ సందర్భంలో కాళిదాసు "గౌతమ వధూ శిలామయీ" అని కరుణామయంగా ఈ సందర్భంలోని శ్లోకంలో వ్యక్తం చేశాడు.

తెలతెలవారుతుండగా లేచారు. మిథిలా నగరోన్ముఖులై నడక సాగించారు. అనతి కాలంలోనే నగరం చేరుకున్నారు.

రఘువంశ దీపకులైన రామ లక్ష్మణులతో కేవల ధర్మస్వరూపుడై విశ్వామిత్ర ముని పుంగవుడు ఆగమిస్తున్న వార్త విన్న జనక మహారాజు ఎదురేగి సర్వసపర్యలతో స్వాగతం పలికాడు.

మహా మంగళప్రదమైన పునర్వసూ నక్షత్రానికి అధిదేవత అదితి. ఆ ప్రశాంత సుందర నక్షత్రం ఆకాశం నుంచి నేలకు దిగుతున్నదా అన్నంత మనోజ్ఞమూర్తులై రామ లక్ష్మణులు ప్రవేశించారు. వారి అపురూప మనోహర మూర్తులను మిథిలా నగర పౌరులు నయన పర్వంగా చూడసాగారు. ఇక్కడ కాళిదాసు ఒక చమత్కారాన్ని ధ్వనిపంచేశాడు. రాముడు పునర్వసూ నక్షత్ర జాతకుడు. ఆ నక్షత్రంలో పుట్టినవాడు సత్యవాదిగా సుగుణ సంపన్నుడుగా, నిరంతరోత్సాహిగా, త్యాగమయునిగా, వైభవోపేతునిగా ప్రవర్థిల్లగలడని జ్యోతిశ్శాస్త్రం చెబుతోంది. దానిని స్మరణకు తెస్తున్నాడు కవి.

జనకుని యజ్ఞదీక్ష ముగిసింది. ఆ మహారాజు సంతసంతో విశ్వామిత్రుని సత్కరించాడు. అతని ప్రసన్నవదనాన్ని అవలోకిస్తూ మహర్షి ఇలా అన్నాడు. "రాముని ధనుర్విద్యను మీరొకపరి తిలకించాలి. అంతేకాదు ఈ చిరంజీవి శివధనుర్దర్శన కుతూహలుడై వున్నాడు."

జనకుడు రాముని సుకుమార సురుచిర విగ్రహాన్ని మరొకసారి వీక్షించాడు. "తన కుమార్తె సీతకు ఈతడే తగిన వరుడు. కాని వివాహ సమయంలో అల్లునికి బహూకరించ దలచిన శివధనువును ఈ అర్భకుడు కనీసం వంచనైనాలేడే! ఎలా నా మాట నిలుపుకోను?" అని మనసులో మౌనంగా వ్యాకులపడుతున్నాడు. చివరికి యిలా అన్నాడు "ఓ పూజ్య విశ్వామిత్రా! మునిసత్తమా! మహా గజములచేత జరగవలసిన పనికి ఒక పిల్ల ఏనుగు పూనుకోగలదా? హాస్యాస్పదం కాదా? ఎలా అంగీకరించమంటారు?" సవినయంగానే విన్నవించాడు.

విశ్వామిత్రుడు చిన్నగా నవ్వుకున్నాడు.

జనకుడే మళ్ళీ చెప్పనారంభించాడు "భగవాన్, ఈ శివధనువును ఎత్తనైనా ఎత్తలేక ఎందరో రాజకుమారులు భంగపడ్డారు. సిగ్గుతో తలలు వంచుకువెళ్ళిపోయారు. అంతకుమందు వారి భుజాలు బలపరాక్రమ సంపన్నాలే! ధనుష్టంకారంతో బిరుసెక్కిన హస్తభూషణులే! ఐతేనేం

ఈ శివధనువును కనీసం కదిలించలేకపోయారు! చివరికా మహాధనువునే ఛీత్కరించుకుంటూ తిరోగమించారు. అలాంటిదీ ధనువును ఈ సుకుమారుడెలా ఎత్తగలడు?"

అప్పుడు విశ్వామిత్రుడు బిగ్గరగా నవ్వాడు. "ఈ రాముడు సుకుమార సుందరుడే కాదనను. కాని దానినిబట్టే అతని బాహుశక్తిని మీరు అపార్థం చేసుకోవచ్చునా? అతని భుజబలాన్నీ, విలువిద్యా నైపుణ్యాన్నీ పరీక్షించి అన్నమాట కాదు కదా! శివధనుర్గుణ వర్ణన ఎంత చేస్తే ఏం లాభం? వజ్రాయుధ బలం, పర్వతంపై ప్రయోగించినపుడు కదా తేలింది? అలాగే ఇతని అపారశక్తి ధనుష్మంతుడైనపుడే తేలగలదు. అది కదా పరీక్ష!" అన్నాడు నవ్వుతూనే.

విశ్వామిత్రుని ఆప్తవాక్యానికి జనకుడు నిరుత్తరుడయ్యాడు. చూపులకు సుకుమారుడే కాని ఎంత శక్తిమంతుడో అన్న సంశయమూ కలిగింది. చిన్న ఆరుద్ర పురుగులా భ్రమింపచేసే నిప్పుకణం మహాటవులను దహించదా? - అని వితర్కించుకున్నాడు. వెంటనే సేవకులను పిలిచాడు. జట్లు జట్లుగా సేవకులు సమీపించారు. ప్రభువాజ్ఞ కోసం ఆత్రంగా నిరీక్షిస్తున్నారు. ఇంద్రధనువును గగనతలంపై ఆయత్తపరచడానికి మేఘరాశివలె సంసిద్ధులై నిలిచారని కాళిదాసు కమనీయంగా ఉపమించాడు.

"మీరందరూ పోయి, శివధనువును మోసుకురండి. అటు కొందరూ ఇటు కొందరూ పట్టుకురండి సుమీ! జాగ్రత్త" అని ఆజ్ఞాపించాడు. ఆ మహాధనువును ఒకరిద్దరు తీసుకురాలేరు కదా!

సౌందర్య దారుఢ్యాలతో శివధనువు మెరసిపోతోంది.

పూర్వమొకప్పుడొక మహాయజ్ఞం జరుగుతోంది. కాని ఆ యజ్ఞం ఫలప్రదం కాకముందే, మృగరూపం ధరించి వేగవేగంగా పారిపోనారంభించింది. అప్పుడా మృగరూప యజనాన్ని కొట్టే శక్తివంతమైన బాణం సంధించడానికి - శివుడీ ధనువును సృజించాడు. అట్టి మహత్తర చరిత్ర కలిగిన ధనువిది.

సేవకులంతా పట్టుకొని భద్రంగా మోసుకురాగానే, దానిని కన్నార్పక రాముడు పరీక్షించాడు. ఎక్కడ పట్టుకుంటే సుళువుగా లేస్తుందో గ్రహించాడు. వెంటనే కుడిచేత దాని మధ్య భాగాన్ని పట్టుకొని పైకెత్తాడు. మన్మథుడెత్తిన పూల బాణంగా, అతి కోమలంగానూ అప్రయత్న సులభంగానూ పైకి లేచింది. వింటి భారాన్ని బిగించడానికి దాని శిరోభాగాన్ని వంచుతున్నాడు. అసాధారణ ధనువును అతి సాధారణ పరికరం మాదిరి ఎత్తడం చూసిన సభాసదులందరూ ఆశ్చర్యచకితులయ్యారు. తమ కన్నులను తామే నమ్మలేకపోయారు. "పుష్పబాణ పేశలంస్మరః" అని కాళిదాసు ఎంతో మనోజ్ఞంగా చెప్పాడు.

రాముడు దాని నారిని బిగించాడు. బలవేగాలను పరీక్షించాడు. అంతే!....అది ఫెళఫెళ మని శబ్దంచేస్తూ నడుమకు రెండుగా విరిగిపోయింది. పిడుగు పడిన శబ్దం భయంకరంగా వెలువడింది. ఆ పిడుగుపాటు నిజంగా జనకుని హృదయాన్ని తాకినట్లయింది. సంభ్రమాశ్చర్య విచలితుడైపోయాడు. అతడా శివధనువు గురించి చిరకాలంగా పొందుతున్న గర్వమంతా ముక్కముక్కలైపోయింది.

అంత అవలీలగా శివధనువెత్తి నారిని బిగించిన రాముని శౌర్య బాహుబలశక్తులపట్ల జనకునకు విశ్వాసం స్థిరపడింది. ప్రేమ అతిశయించింది. ఆ చిరంజీవిని అభినందించాడు. ఇంతటి మహత్కార్యానికి తన కుమార్తె సౌందర్యరాశి అయోనిజ సీతను శుల్కంగా ఇవ్వగలనని ప్రకటించాడు. సగౌరవంగా వివాహం జరుపుతానని సభాస్థారుల ఎదుట వాగ్దానం చేశాడు. విశ్వామిత్రుని మనోరథం సఫలమైంది. జనక మహారాజు సత్యసంధతకు విఖ్యాతుడు. పైగా సభలో ప్రతిజ్ఞ చేశాడు.

మహా తేజస్వి విశ్వామిత్రుని సన్నిధినే అగ్నిసాక్షిగా సంభావించి తక్షణమే వివాహం జరుప నిశ్చయించాడు. సీతకు కబురు చేశాడు. సకలాలంకార భూషిత, అతిలోక సౌందర్యవతి సీత పుష్పదామంతో సభాస్థలికి వచ్చింది. జగదేకసుందరుడు రాముని క్రీగంట వీక్షించింది. రాముని గళంలో విజయమాలిక అలంకరించింది. విశ్వామిత్ర మహర్షి ఆశీర్వదించాడు.

ఒక పురోహితుని పిలిపించాడు. సగౌరవంగా "నీవు వెళ్ళి దశరథ మహారాజుతో నా కుమార్తెను కోడలుగా పరిగ్రహించ వలసిందిగా నా కోరికను నివేదించు, మా 'నిమి' వంశాన్ని తన సేవకు స్వీకరించమని మనవి చేయి. శ్రీరాముని మహద్యుతిని తాను అల్లునిగా స్వీకరిస్తున్నట్లు విశదం చేయి" అంటూ వివరించాడు. అవసర వస్తు సామగ్రిని సమకూర్చి ప్రయాణ సన్నద్ధం చేశాడు.

అప్పటికే రామాదులకు వివాహ యోగ్యమైన యుక్తవయస్సు ప్రాప్తించినదని దశరథుడు తలపోస్తున్నాడు. రామునికి తగిన కన్యక ఎక్కడ లభిస్తుందా అని విచారిస్తున్నాడు. సన్నిహితులను సంప్రదిస్తున్నాడు. సమయానికే జనకుని శుభవర్తమానం అందింది. ఆనందంతో కౌశల్యాది రాణులను పిలిపించాడు.... "పుణ్యవంతుల కోరికలు కల్ప వృక్షఫలముల వంటివి, పుట్టీ పుట్టగానే ఫలిస్తాయి" అని యీ సంఘటనను కాళిదాసు వ్యాఖ్యానించాడు. నిజమే మరి, రాముని వివాహ కాంక్ష మదిలో మెదలడమే తడవుగా జనకుని ఆహ్వానమందుకోవడం ఎంత గొప్ప సన్నివేశం!

దశరథ మహారాజు - ముఖ్య పరివారంతో, రాణులతో పరిజనంతో, సన్నిహితులతో ఈ శుభవార్త ముచ్చటించి ఆనందించాడు. జనక పురోహితునకు వెంటనే సకల సత్కారాలూ జరిపాడు. సర్వసన్నద్ధుడై మిథిలానగరికి తరలి వెళ్ళాడు.

సపరివారంగా మిథిలకు చేరిన దశరథుడు నగరోపవనాలలో గజ తురంగ రథాది పదాతి దళాలను నిలిపాడు. అప్పుడా ఉపవన వృక్షలతాదులు పీడ్యమానములైనవి. మధుర వేదనలనుభవిస్తున్నవి. "స్త్రీ వ కాంత పరిభోగ మాయతమే" అని కాళిదాసు ఆవనస్పతులు పొందుతున్న పీడన ప్రీతిప్రాయంగానే ఉన్నదని వర్ణించాడు.

దశరథ జనక మహారాజులు, దేవతలలో వరుణునివలెనూ, మహేంద్రునివలెనూ అత్యధికులు. వైదిక కర్మలలో నిష్ఠాగరిష్ఠులు. అట్టి మహారాజులు వియ్యమందుతున్నారు.

తమ బిడ్డల వివాహ మంగళములను తమ వైభవానుకూలంగా సశాస్త్రంగా నిర్వర్తించారు.

వెనువెంటనే లక్ష్మణునకు జనక మహారాజు తనూజ ఊర్మిళతో పెళ్ళి జరిపారు. భరత శత్రుఘ్నులకు - జనకుని తమ్ముడైన కుశధ్వజుని కుమార్తెలు - మాండవీ శ్రుతకీర్తి అనే అతిలోక లావణ్యావతులను సమర్పితంగా వివాహాలు జరిపించారు. అంటే సీతా రాములు, ఊర్మిళా లక్ష్మణులు, మాండవీ భరతులు, శ్రుతకీర్తీ శత్రుఘ్నులు అనే నాల్గు జంటలకు క్రమానుగత కళ్యాణశోభ లందాయి. ఆ మహత్తర సామూహిక వివాహాలు చూపరులందరికీ నయనానందకరమై శోభించాయి. సాకేత మిథిలా నగరాలే వియ్యమంది, అమర బాంధవ్యం నెరపినట్లుంది.

పరమప్రముఖమైనది సీతారామ కళ్యాణమే. కనక అదెలా జరిగిందని కాళిదాసు వర్ణించాడో పైన తెలుసుకున్నాము. వాల్మీకి తెలిపినట్లు జనక మహారాజు స్వయంవరం ప్రకటించనూలేదు. విశ్వామిత్రునితో రామ లక్ష్మణులు మిథిలకు వచ్చి ఆ వార్త విననూ లేదు. సీత రహస్యంగా చెలికత్తెలతో సహా రాముడున్న తావుకు వెళ్ళి వరించనూలేదు. వివిధ రాజులూ, రాజకుమారులూ స్వయంవరంలో తమ అదృష్టాన్ని పరీక్షించుకోనూలేదు. రావణుడు సైతం వచ్చి, శివధనువు నెత్తబోయి బోర్లాపడి నవ్వులపాలు కానూలేదు. శివధనువును జనకుడు ఒక సాధనగా నియుక్తమూ చేయలేదు. కాళిదాసు చెప్పినదాని ననుసరించి ఆ మహాధనువును వరశుల్కంగానే బహూకరించ దలిచాడు.

ఇలాంటి చిల్లర మల్లర అంశాలన్నిటినీ కాళిదాసు పరిహరించాడు. అనవసర ఆర్భాటాలను పరిత్యజించాడు. తన కాలంనాటి వైవాహిక మర్యాదలను పాటించాడు. ఔచితీ పరిపోషణం కావించాడు. కాళిదాసు దర్శనంలో శివధనుర్భంగం యాదృచ్ఛికంగా జరిగినదే. పరీక్షగా కానేకాదు. ఐతే వాల్మీకి రామాయణంలోనే కాలగమనంలో అనేక ప్రక్షిప్తాలు చేరాయని నేటి పరిశోధక పండితులు సహేతుకంగా నిరూపిస్తున్నారు. రామాయణ మౌలికగాథను తదుపరి కవులెందరో ఎన్నో మార్పులతో తమ కావ్యాలు విరచించారు. ఐదు, ఆరు శతాబ్దాల నడుమవాడైన కాళిదాసు, తన కాలంనాటికే మూలకథలో ఎన్నో మార్పులు వచ్చినట్లు గుర్తించాడు. తానున్నా స్వతంత్రించాడు. పురాణకథన రీతిని త్యజించాడు. కావ్య మనోజ్ఞత్వాన్ని పాలించాడు. ఉచితమైన మార్పులూ చేర్పులూ చేసాడు. అదే రఘువంశంలోని రామకథకు విశిష్టత.

★ ★ ★ ★

నవవధూ పరిగ్రహణ సంతుష్టులైన రామాదులు - సామదానభేద విగ్రహోపాయాల వలె ప్రకాశిస్తున్నారు. వారి సతులు ఫలసిద్ధుల వలె భాసిస్తున్నారు. సతీసమేతులైన కుమారులను చూసి దశరథుని కన్నులు పండుగ చేసుకుంటున్నాయి.

ఆయన, భార్యలు ముగ్గురూ తమ పరిజనులతోనూ, కుమారులు, కోడండ్రతోను, బయల్దేరి, అయోధ్యకు ప్రయాణమయ్యాడు. దూరదేశానికి బయల్దేరే ఆత్మీయులకు మూడు మజిలీల

వరకూ సాగనంపి వీడ్కోలు తెలుపడం సంప్రదాయం. దానిననుసరించి, జనక మహారాజు సాగనంపరాగా, ఆయన్ని మర్యాదచేసి వెనక్కి పంపించాడు దశరథుడు. తమ ప్రయాణం ముందుకు సాగించారు. వారి రథాలకున్న కేతనాలు ఎదురుగాలుల తాకిడికి మిథిలానగర దిశగా ఎగురుతున్నాయి. గడచివచ్చిన దారిని చూపుతున్నట్లున్నాయి.

పడమటిదిశగా సాగుతున్న సూర్యబింబానికి ఇంద్రధనుస్సు వలయంగా చుట్టుకుంది. ఆ దృశ్యాన్ని దశరథాదులు తిలకించారు. ముచ్చటపడుతూ తమ నగరదిశగా సాగుతున్నారు. దిక్కులనిండా ఎర్రని దుమ్ము రేగుతోంది. సూర్యాస్తమయ సమయం చేరువవుతోంది. వనాంతరాలలో నక్కల వూళలు దవ్వులనుంచి వినిపిస్తున్నాయి.

ఇలాంటి అపశకునాలు ఎందుకు కలుగుతున్నాయి? వీటికి శాంతి ఏమిటి? సమీపంలోనే ఉన్న వశిష్టుని దశరథుడడిగాడు. ఇవేవీ అపశకునాలు కావని, శుభకరములు గానే పరిణమించగలవనీ ఆయన తెలిపాడు.

ఇంతలోనే ముందుగా నడుస్తున్న సైన్యం ముందు ఒక విశేష కాంతిపుంజం సాక్షాత్కరించింది. అందరి కన్నులూ మిరుమిట్లు కొలిపాయి. సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. కళ్ళు నలుముకు చూశారు. ఆ తేజోరాశి నుంచి ఒక పురుషాకృతి దర్శనమిచ్చింది. ఆ ఆకారంలో సూర్యచంద్ర బింబాలు మిళితమైనట్లుంది. రజోసత్వగుణ సంపన్నంగా దర్శనమిచ్చింది. బ్రాహ్మణోచిత యజ్ఞోపవీతం ధరించింది. క్షత్రియోచిత ధనుర్బాణాలనూ ధరించింది. ఆ మహాకృతి చివరకు పరశురామునిగా దర్శనమిచ్చింది. అతని తండ్రి జమదగ్ని - బ్రాహ్మణుడు. తల్లి రేణుక క్షత్రియ కుమార్తె. ప్రసేనజితుడనే రాజపుత్రిక. కనుకనే పరశు రామునిలో ఆ రెండు అంశలూ జతకూడాయి. సర్పములతో కూడిన చందనవృక్షంలా మెరుస్తున్నాడాయన. పితృవాక్య పరిపాలనార్థం, తల్లి శిరస్సును ఖండించినవాడు కదా! తల్లియందలి గౌరవంతో తిరిగి బ్రతికించుకున్న సత్త్వగుణుడు కదా!

కార్తవీర్యార్జునుడు పొగరుతో, తన తండ్రి శిరస్సు ఖండించిన సంగతి తెలుసుకుని భూమిని క్షత్రియ రహితంగా చేశాడు. కాశ్యప మునీంద్రునకు యజ్ఞదక్షిణగా భూమిని సమర్పించాడు. మహేంద్ర పర్వతానికి పోయి, తపస్సు చేసుకుంటున్నాడు. ఈ విధంగా పరశురామునిలో రాజస, సత్త్వ గుణాలు మిళితమైపోయాయి.

ఆ తేజశ్శాలికి శివధనుర్భంగం ఒక క్షత్రియ కుమారునివల్ల జరిగిన సమాచారం తెలిసింది. కోపం ప్రజ్వరిల్లింది. ఆ సంగతి స్వయంగా పరిష్కారం చేద్దామనే వచ్చాడు. దశరథాదుల కెదురయ్యాడు. తనకూ, తన కుమారులకూ, ఎటువంటి ముప్పు వాటిల్ల నున్నదోనని భయపడుతున్నాడు దశరథుడు. భార్గవునకూ, దాశరథికీ నామసామ్యముంది. ఇరువురూ రాములే కదా! ఆ నామసామ్యం కూడా ఇప్పుడు దశరథ మహారాజుకు భయకారకమే అవుతోంది. నమ్రతతో అతడికెదురేగి అర్ఘ్యపాద్యాలు స్వీకరించమని దశరథుడర్థించాడు. పరశురాముడు వినిపించుకోవడం లేదు.

రాముడెవరా అని అతని చూపులు పరికిస్తున్నాయి. ధనుస్సు చేబూని, బాణం సంధిస్తూ భయంకరంగా కనిపిస్తున్నాడు పరశురాముడు. క్షతకోపాగ్ని జ్వాలలా మెరుస్తున్నాడు. గొంతెత్తి ఇలా అన్నాడు "నా తండ్రిని నిష్కారణంగా చంపిన కారణంవల్ల, కక్షపూని ఇరవై ఒక్కమార్లు భూప్రదక్షణం చేశాను. క్షత్రియులందర్నీ హతమార్చాను. ఎక్కడ ఎవడు మిగిలినా క్షత్రియులంతా నాకు శత్రువులే. శత్రువినాశనంతో శాంతించి, తపస్సు చేసుకుంటున్నాను. నిద్రిస్తున్న పామును కర్రతో పొడిచినట్లు నీ పరాక్రమ శ్రవణం నాకు మళ్ళీ కోపం తెప్పిస్తోంది."

శ్రీరాముడు నవ్వుతూ నిల్చున్నాడు. పరశురాముని హేలగా వీక్షిస్తున్నాడు. అతని మాటలు వింటూండగా రాముని కన్నులలో వినమ్రత తొణికిసలాడింది. భార్గవరాముడు కనిపెట్టాడు. మళ్ళీ ఇలా అన్నాడు "ఇతర క్షత్రియు లెవరూ ఎత్తనైనా ఎత్తలేని మహత్తర శివధనువును నీవెత్తి, ఎక్కుపెట్టి విరిచివేశావట కదా! ఆ సమాచారం నాకు తెలిసింది. నీ శౌర్యశృంగాన్ని భంగం చేయాలనే వచ్చాను. నా సంకల్పం నెరవేర్చుకుంటాను."

శ్రీరాముడేమీ మాట్లాడలేదు. పరశురాముడే ఇంకా ఇలా అంటున్నాడు "నిన్నటివరకూ, రామనామధారిని నేనొక్కడినే. ఇప్పుడభ్యుదయ మందుతున్న నీవుకూడా, రామునిగా భాసించడం నాకు అవమానకరం. క్రౌంచాది పర్వతాలను భేదించగల్గిన దారుణాస్త్రాలు కలిగినవాణ్ణి. కార్తవీర్యుడనే దుష్టుడు, మా తండ్రిగారి ఆశ్రమంపై దండెత్తాడు. వాడిపై యుద్ధంచేసి గెలిచాను. అవారణ శత్రువనుకున్నవాడిని నివారణమొనర్చాను. ఇక ధీనీవో నా కీర్తిని అపహరించ పూనుకున్నావు. ఏతత్తుల్యమైన అపరాధంతో నువూ నాకు శత్రువుగానే నిలుస్తున్నావు. జాగ్రత్త!" అంటూ తిరస్కార వచనాలు పలికాడు.

పరశురాముని కోపం చల్లారలేదు. ఇంకా ఇలా అన్నాడు "అచ్చమైన అగ్ని గడ్డి గాదం ఉన్నపుడే ప్రజ్వలించి ఊరుకోదు. మహాసాగరమందైనా బడబాగ్నిగా జ్వలిస్తుంది. కనుక నిన్ను జయించకుండా విడిస్తే నా జీవితమంతా బాధామయమైపోతుంది. పైగా నువ్వు ఈశ్వర చాపాన్ని విరిచి శాపగ్రస్తుడ వయ్యావు. గర్వం నీ తలకెక్కింది. నేనెలా సహిస్తాను? అందుకే నీకీ పరీక్ష. ఇదుగో నా ధనువు. దీనికి నారి ఎక్కుపెట్టు. అది చాలు ముందు. ఆపైన యుద్ధం మాట చూసుకుందాం. ముందీ పని నువ్వు చేయగలిగితే నాతో సమాన బలాఢ్యుడవని నేనంగీకరిస్తాను. నీ చేతిలో ఓటమి పొందినట్లూ భావిస్తాను" అన్నాడు భార్గవరాముడు.

చివరి హెచ్చరికగా ఆయనే మళ్ళీ ఇలా అన్నాడు "ఇప్పటికే నా పరశు ధారలచే భీతిచెంది, నీ కరచరణాలు కంపిస్తున్నాయేమో! ఇక నీవేమి నా ధనువెక్కుపెట్టగలవు? కనుక, అంజలిబద్ధుడవై, నా దయకి ప్రార్థించు" అంటూ చులకన చేశాడు.

రఘురాముడు పరీక్షకు నిలవడమే సముచితమని భావించాడు. భార్గవుని చేతిలోని ధనువు నారాయణాంశతో శోభిస్తోంది. దానిని అతని చేతినుంచి గ్రహించేసరికి రాఘవుని కొక నూత్నశోభ వెల్లివిరిసింది. అప్పుడు కాళిదాసు మహాకవి చక్కగా వర్ణించాడు. "కేవలోపి సుభగోనయ నాంబుదః కింపృస్తి. దశ చాపలాంఛితం" అని. తొలకరి మేఘం ఉత్తనే నేత్రపర్వం చేయగలదా?

దానిపై హరిచాపం చేరినపుడే మరింత సుభగ సుందరమై భాసిస్తుందికదా! అలా మెరిసిపోయాడు శ్రీరాముడు, భార్గవుని చేతిలోని విష్ణుధనువుని స్వీకరించగానే. జ్వాలలారిపోయిన పొగలా మిగిలాడు పరశురాముడు. అతని యశోగర్వ శోభిత ముఖమండలం పరాభవచ్ఛాయలతో నిండిపోయింది.

ఇరువురు యోధాగ్రేసరులు ఒకరి ఎదుట ఒకరు నిలచి ఉన్నారు. రాముని తేజస్సు పెరుగజొచ్చింది. పరశురాముని తేజం తరుగుతోంది. పూర్ణిమనాటి సాయంసంధ్యలో అస్తమయ సూర్యునివలె పరశురాముడు వెలవెలబోతున్నాడు. చంద్రోదయశోభతో శ్రీరాముడు తళతళలాడుతున్నాడు. అతని హృదయం దయాపూరితమై నిలిచింది. భార్గవుడు గళితశౌర్యుడై నిలిచాడు.

రాముడు అవలీలగా బాణం ఎక్కుపెట్టాడు. "నేనెక్కుపెట్టిన బాణం నిరుపయోగం కారాదు. నీవు నన్ను తిరస్కరించావు. కాని, నీవొక మునిపుంగవుడవు. నాకు పూజనీయుడవు. కనుక నీపై బాణప్రయోగం చేయబోవడంలేదు. నాయీ అమోఘ బాణాన్ని ఏంచేయమంటావో చెప్పు! నీ గమనం ఆపుచేయనా? నీవార్జించిన స్వర్గాన్ని కూలద్రోయనా? చెప్పు.....!"

"నీవు వైష్ణవ తేజంతో రాఘవునిగా జన్మించిన సంగతి నాకు తెలియనిది కాదు. నీ శక్తియుక్తు లెట్టివో పరీక్షించతలచానంతే. కోపమూ తెప్పించాను. నేనా..... నా పితృశత్రువులను భస్మీపటలం చేశాను. నేను స్వాధీనం చేసుకొన్న భూమినంతా యాగదక్షిణగా కశ్యపునికి సమర్పించాను. కనుక నా తేజస్సును ఆహరించడం నాకు సంతోషదాయకమే. నిన్ను కోరేది ఒక్కటే - అనేక పుణ్యతీర్థాలకు పర్యటించదలచాను. దయతో కాళ్ళు మాత్రం లేకుండా చేయకు. నాకు తపోనిష్ఠయే తప్ప స్వర్గసౌఖ్యాభిరతి లేనేలేదు. దానిని కూలద్రోసినా చింతలేదు. నీ అమోఘ శరాన్ని నా స్వర్గఫలితాలపైనే సంధించు....." అని భార్గవుడర్థించాడు.

రాఘవుడంగీకరించాడు. ప్రాఙ్ముఖంగా బాణం విడిచాడు. అది భార్గవుని స్వర్గమార్గాన్ని కూలద్రోసింది. "మహానుభావా! తప్పనిసరై నేనీపని చేశాను. క్షమించు" అంటూ రాముడు పరశురాముని పాదాలకు నమస్కరించాడు. ఆ మునిలో మిగిలిపోయిన గర్వాన్ని భగ్నం చేయసమకట్టాడే కాని అతనిపట్ల రామునికి ఎంతో పూజ్యభావం వుంది. భార్గవుడతనిని లేవనెత్తి కౌగలించుకున్నాడు. "ఆజన్మతః నాలో పెంపొందిన రాజసగుణాన్ని నేటితో పూర్తిగా తొలగించావు. ఇక నేను సత్త్వగుణ ప్రధానుడనై తపోనిష్ఠతో శేషజీవితం గడుపుతాను. నాకీ సదవకాశం కలిగించి ఎంతో ఉపకారం చేశావు. రాగద్వేషాతీత జీవితాన్ని అనుగ్రహించిన నిన్ను స్తుతించకుండా ఉండలేను .... నీకు సకల కార్యాలూ అవిఘ్నంగా నెరవేరగలవు..." అని శ్రీరాముని ఆశీర్వదించాడు, భార్గవుడు అంతర్ధానమయ్యాడు.

ఈ యావత్సన్నివేశాన్నీ దశరథ మహారాజు ఆనందాశ్చర్యాలతో వీక్షిస్తూనే ఉన్నాడు.

మార్గమధ్యంలో డేరాలు నిర్మించుకుని, కొలది దినాలు మజిలీలు చేశారు. చివరకు అయోధ్య చేరుకున్నారు. దశరథ పరివారం సకలైశ్వర్యాలతో తిరిగి విజయం చేయడం కన్నులార చూసి ఆనందించాలని పురజనులు నిరీక్షిస్తున్నారు. పురాంగనలు తమ ఇండ్ల గవాక్షాలలో

కన్నులింతలు చేసుకొని వేచుకున్నారు. ముఖ్యంగా మైథిలీ దర్శనార్థం విరిసిన కలువల వంటి కన్నులతో పురంధ్రీమణులు కాచుకుని ఉన్నారు.

కాళిదాసు మహాకవి ఏకాదశ సర్గ ముగించాడు.

దశరథ మహారాజు సకల వైభవాలూ అనుభవించాడు. సర్వవాంఛితాలనూ తీర్చుకోగలిగాడు. ఈప్సితాలన్నీ నెరవేరాయి. మెల్లగా అవసానదశకు చేరుకుంటున్నాడు. రాత్రి తెల్లవార్లూ కాంతులు వెదజల్లి, తైలమంతా అనుభవించి, వత్తి చివర మాత్రం మిగిలి మిణుకులాడుతున్న దీపకళిక వలె మోక్షానికి నిరీక్షిస్తున్నాడు. ఆయన చెవుల ప్రక్క నిలిచిన పలితకేశాలు - మిగిలిన కర్తవ్యాన్ని ప్రబోధిస్తున్నట్లున్నాయి. 'రామునికి పట్టాభిషేకం జరిపి కృతకృత్యుడవు కావాలి సుమా' అని కాలం గుసగుసలాడుతున్నట్లుంది.

మహారాజు మనసు కలవరపడుతోంది. కైకేయి ఎక్కడ వినిపోతుందోననే వ్యాకులతతో 'రహస్యంగా, తెల్లవెంద్రుకలు కర్తవ్యబోధ చేస్తున్నాయేమో'నంటాడు కవి.

ఉద్యానవనంలో పారే నీటి కాలువ - ప్రతిచెట్టు పాదాలనూ తడుపుతూ ఉంటుంది. ఏవో మౌన సందేశాలందిస్తూ ఉంటుంది. ప్రశాంతినీ కల్గిస్తుంది. అలాగే దశరథుడు సంకల్పించిన రామ పట్టాభిషేక వార్త ప్రజల హృదయాలను చల్లగా తాకింది. నగరవాసు లందరూ ఆహ్లాదైక చిత్తులయ్యారు. "రామస్యాభ్యుయమశ్రుతి" అని మహాకవి ప్రయోగించాడు. వినపడుతున్నది కనక వార్త శ్రుతి అయ్యింది. అది నారీమణుల లలితవాక్కు వలె మనోజ్ఞంగా ప్రసరిస్తోంది". అదే వార్త కైకేయి చెవులకు సూదులు గ్రుచ్చినట్లుంది. ఆమె తన కార్యాలు నెరవేర్చుకుందుకు ఎంత మొండిపట్టునైనా విడువదు.

ఆమె పట్టుదల దశరథుని హృదయాన్ని క్షోభింపచేసింది. ఆ వృద్ధ మహారాజుకు కన్నీళ్ళ ప్రవాహం ఎడతెగడం లేదు. పట్టాభిషేక సంభారాలన్నిటినీ ముంచివేసిందా కన్నీరు. ఆయన, ఆమెను బ్రతిమాలుకో నారంభించాడు. ఆ అనునయ వాక్యాలు చల్లని వానజల్లులవలె కురుస్తున్నాయి. వాన కురిసేసరికి పుట్టలో విశ్రాంతి తీసుకుంటున్న త్రాచుపాములు బయటకు వెడలినట్లు మరీ భయంకరమైంది. వెనక ఎప్పుడో, రాజు తనకిస్తానన్న రెండు వరాలూ బైటపెట్టింది కైకేయి. చండికలా గర్జించింది.

ఆ రెండు వరాలలో మొదటిది - రాముడు పదునాలుగేళ్ళు అరణ్యవాసం చేయాలన్నది. తన కుమారుడైన భరతునకు రాజ్యపట్టాభిషేకం జరపాలన్నది రెండోదీ. ఈ మొండిపట్టు వల్ల ఒనగూడే ఫలితం ఆమెకు తెలియదు. పట్టాభిషేకం జరిగినా భరతునికి రాజ్యభోగం లభించదు. తనకా వైధవ్యం ప్రాప్తిస్తుంది.

తనకు పట్టాభిషేకం జరిపిస్తున్నట్లు తండ్రి తనతో చెప్పినపుడు ఆయన సజీవుడై ఉండగా తనకెందుకీ పట్టాభిషేక మన్న చింతతో రాముని హృదయం దుఃఖపడింది. ఇప్పుడు సవతితల్లి కైకేయి కోరినవరం వల్ల తనకు వనవాసం, పితృవాక్య పాలనం రెండూ తీరాయికదా అని

అతనికి సంతోషమూ కల్గింది. పట్టాభిషేక మహోత్సవం కోసం ధరించిన పట్టుబట్టలు పరిత్యజించాడు. అరణ్యవాసోచిత వలువలు ధరించాడు. అతని ముఖవర్చస్సులో ఏమీ మార్పు రాలేదు. పైగా కర్తవ్యదీక్షతో ప్రకాశిస్తోంది. ఈ స్థితి చూపరులకు ఆశ్చర్యం కల్గించింది.

తన తండ్రి ఇచ్చిన వరదాన సత్యవ్రతం నుంచి జారనీకుండా తల్లి కాపాడినందుకు రాముని కానందం కలిగింది. ఆ ఆనందంతోనే సీతా లక్ష్మణులతో కలిసి దండకారణ్యం చేరుకున్నాడు. నిరాపేక్షకమైన ఈ చర్య సత్పురుషులకు సంతృప్తి కలిగించింది. సర్వకాలము లందునూ రాముని అంటిపెట్టుకొని వుండే సీతా లక్ష్మణులు తమంత తామే రామునితో వనవాసానికి బయలుదేరారు.

పుత్రవియోగ దుఃఖం దశరథుని అవసానదశకు వేగిరపరచింది. ఇక జీవించడం వ్యర్థమన్న తీవ్రక్షోభ అతన్ని కలచివేసింది. తన పొరబాటువల్ల పూర్వం తన బాణం తగిలి, చనిపోయిన మునికుమారుని తండ్రి ఇచ్చిన శాపం జ్ఞాపకం వచ్చింది. ఆ పాపానికిది నివృత్తి కాబోలు! తన శరీర పరిత్యాగం తప్ప, అన్య పరిష్కారమార్గం లేదని దశరథుడు నిశ్చయించు కున్నాడు. శుద్ధికర్మతో శరీరాన్ని పరిత్యజించాడు.

రామలక్ష్మణులు అరణ్యంలో ఉన్నారు. భరత, శతృఘ్నులు మేనమామ గారింట ఉన్నారు. దశరథుని అవసానంలో పుత్రులెవ్వరూ దగ్గరలేరు. రాజు మరణించగా అయోధ్య అనాథ అయ్యింది. రంధ్రాన్వేషణా తత్పరులైన శత్రురాజులు వశమొనర్చుకోగల విషమస్థితి దాపురించింది అయోధ్యకు.

ఆప్తులవల్ల భరతుని కీ దుఃఖవార్త అందింది. వారు కన్నీళ్ళు తుడుచుకుంటూ దశరథుని మరణవార్తను, శ్రీరాముని అరణ్యవాస వార్తనూ అందించగా భరతుడు ప్రూన్పడ్డాడు. వెంటనే అయోధ్యకు బయల్దేరాడు. దశరథుని అంత్యక్రియలు జరిపించాడు. కైకేయి కోరిన ప్రకారం, భరతుడే పట్టాభిషేకం పొందవలసి వుంది. కాని, ఈ ఆకస్మిక విషాదం సంఘటించింది. దీనికి కారణమైన తల్లిని చూడటానికే ఉపేక్షించాడు. భరతుడు ఎడమొగంతో తిరుగుతున్నాడు. రాజ్యాధికారం గురించీ పరాఙ్ముఖుడయ్యాడు.

వెంటనే అన్నను చూడటానికి అరణ్యానికి బయలుదేరాడు. దారిలో కనిపించిన వారినందరినీ అడుగుతున్నాడు. ఆశ్రమవాసులందరినీ రాముని భోగట్టా తెలుపమని అర్థిస్తున్నాడు. "అదిగో ఆ చెట్లక్రింద వుంటున్నారు" అంటూ వారు దూరానికి చూపగా ఆత్రంగా నడిచాడు.

సైన్యంతోసహా భరతుడు వస్తున్నదారి, ధూళి రేగుతున్నది. వారు సమీపిస్తూండటం సీతారామ లక్ష్మణులు చూసారు. చిత్రకూట పర్వత ప్రాంతారణ్యాలలో ఉంటున్నవారిని భరతుడు సమీపించాడు. అన్నకు సాదరంగా నమస్కరించాడు. తండ్రిగారి మరణవార్త తెలిపాడు. అయోధ్యకు తిరిగివచ్చి, పట్టాభిషేకం పొందమని అర్థించాడు. అన్నగారుండగా, రాజ్య పాలనాధికారం తను వహించడం అన్యాయమని వేడుకున్నాడు. కర్తవ్యం నిర్వర్తించమని కోరాడు.

రాముడు అనృత దోషానికి అంగీకరించలేదు. తండ్రి కిచ్చిన వాగ్దానం భంగపరచడం పాప హేతువన్నాడు. రాముని దృఢసంకల్పం నుంచి మరల్చడం భరతునికి సాధ్యపడలేదు. కనీసం రాముని పాదుకలు ఇమ్మని కోరాడు. వానిని అతనికి మారుగా సింహాసనం పై ఉంచి తాను రాజ్యకార్య నిర్వహణ చేసే అవకాశం కల్గించమని వేడుకున్నాడు.

రాముని పాదుకలు కొనిపోయాడు. సింహాసనంపై భద్రపరిచాడు. తాను రాజభోగాల నుభవించడం లేదు, ఇతరుల సొత్తును సంరక్షించే బాధ్యతను భరతుడు స్వీకరించాడు. రాజకార్యాలు శ్రద్ధగా నిర్వహించాడు. తన తల్లి చేసిన మహాపాపానికి ఇదే ప్రాయశ్చిత్తమన్నట్లు వ్యవహరిస్తున్నాడు. తన నివాసం అయోధ్య నుంచి నంది గ్రామానికి మార్చుకున్నాడు. రాజప్రతినిధిగా రాచకార్యాలు చక్కదిద్దుతున్నాడు.

ఈ సన్నివేశంలో కవికులపతి వర్ణన ఎంతో రమణీయంగా సాగింది. వృద్ధులైన ఇక్ష్వాకు వంశ రాజులవలె కాక, రాముడు యౌవనదశలోనే వానప్రస్థాశ్రమం గడుపుతున్నాడు. వైదేహితోను, తమ్ముడు లక్ష్మణునితోనూ వనాలు తిరుగుతూ కందమూలాలు తింటున్నాడు. తనకన్నా చిన్నవారైన వారిరువురికీ రాముడు వానప్రస్థాశ్రమ విధినే కల్పించాడు. మహావృక్షం, తన విశాలమైన శాఖలతో ప్రాక్పశ్చిమాలనుంచి ప్రసరించే ఎండను అడ్డుకుంటుంది. చల్లని నీడనే ప్రసరిస్తుంది. అలాంటి వృక్షచ్ఛాయలో వారు బసచేశారు.

తిరిగి తిరిగి అలసటతో ఆ స్థావరానికి వచ్చాడు రాముడు. సీత తొడపై తలాన్చుకుని విశ్రమించాడు. నిద్రపట్టింది. ఇంద్రపుత్రుడగు కాకాసురుడు సీతావక్షస్థలాన్ని గోళ్ళతో చీల్చనారంభించాడు. భీతాత్మయైన జనకాత్మజ ఆర్తనాదం చేసింది. రాముడు మేల్కొన్నాడు. సమీపంలోగల రెల్లుగడ్డిని మంత్రించి, బాణంగా ప్రయోగించాడు. ఆ కాకిని అది తరిమి తరిమి కొట్టింది. తట్టుకోలేక శరణు శరణంటూ రాముని పాదాలపై వాలింది కాకం!

తన బాణ ప్రయోగం వ్యర్థం కాజాలదు కనక నీ శరీరంలో ఒక భాగాన్ని ఖండించక తప్పదు అన్నాడు రాముడు.

కాకము తన కన్నులలో ఒకదానిని చూపాడు. రామబాణం దానిని హరించింది. దాని మంత్రశక్తి పొందిన అచ్చమైన శరీరం ఉపశమించింది. మహాసౌందర్యవతిజానకికితనవల్ల జరిగిన బాధను క్షమించమని వేడుకున్నాడు. కాకాసురుడు తిరోగమించాడు.

చిత్రకూటం అయోధ్యకు మరీదూరంలో లేదు. భరతుడు వచ్చి అభ్యర్థించినట్టే - అయోధ్యవాసులైన ప్రజలున్నూ గుంపులుగా ప్రతిదినం వచ్చేవారు. ఈ ప్రజల అభ్యర్థన ఒక బెడదగా మారింది. కనక మరింత దవ్వులకు వనాంతరంలోకి సాగడం మంచిదని వారు యోచించారు. ముగ్గురూ ప్రయాణమయ్యారు. చిత్రకూటంలోని లేళ్ళు వారికెంతో మచ్చికయి కూడాకూడా తిరుగుతూ ఉండేవి. వీరిపుడా స్థలం విడిచి వెడ్తున్నారు. వారిని అవి విడువలేక కూడా రానారంభించాయి. వాటిని నిమిరి, వెనుకకు సాగనంపి, ముందుకు సాగక తప్పలేదు.

వర్షాకాలం ప్రారంభమైంది. మున్యాశ్రమాలలో వారు అతిథులుగా బసచేస్తూ ముందుకు

సాగేవారు. ఆ మునిగుణం మధ్యలో ఈ తేజశ్శాలురు ఉడుగణంలో సూర్యుల వలె ప్రభాసించేవారు. రాముని ప్రతిభా రశ్మివల్ల మున్యాశ్రమాలకు భద్రత కలిగేది. వారిని వేధించే రాక్షస సమూహం కల్పించే బాధలు ఉపశమించి ప్రశాంతత ఏర్పడింది.

వానలు తగ్గుముఖం పట్టడంతో వారు మళ్ళీ బయలుదేరారు. దక్షిణాభిముఖంగా ప్రయాణం సాగించారు. రాముని వెన్నంటే సీత - రాజ్యలక్ష్మి వలెనే శోభాయమానంగా ప్రకాశించేది. మధ్యేమార్గంలో ముగ్గురూ, అత్రిమహర్షి ఆశ్రమానికి చేరుకున్నారు. పుణ్య గంధాదులతోనూ పుష్పములనుంచి లేచి అశేష షట్పదుల ఝుంకారాలతోనూ ఆశ్రమం సౌందర్యోపేతంగా ప్రశాంతంగా ఉంది. అనసూయాదేవి, వారికి ఎదురొచ్చి, సీతను ఆలింగనం చేసుకుంది. మహర్షి వారిని ఆశ్రమంలోనికి ఆహ్వానించాడు. సకల సపర్యలూ జరిపారు. అనసూయాదేవి, సీతకు పసుపు, కుంకుమ, గంధాదులిచ్చి సత్కరించింది. అత్రి, అనసూయల ఆదరణ లందుకొని, ప్రయాణోన్ముఖులయ్యారు.

ప్రయాణం సాగుతోంది. మార్గమధ్యంలో విరథుడనే భయంకరాకారుడైన రాక్షసుడు వారి నడ్డగించాడు. రామలక్ష్మణుల నడుమ లవంగలతిక వలె సాగుతున్న సీతను విరథుడు పెనగి పట్టుకొని ఎత్తుకు పోనారంభించాడు. ఈ మహావీరుల కారణంగా వాడికి మరణం ఎదురైంది. ఆ విరథుని పట్టి, వాడి భయంకర శరీరాన్ని ముక్కముక్కలుగా నరికి హతమార్చారు. వాడి శరీర దుర్గంధం వల్ల వనాంతర వాతావరణం కలుషితమైపోతుందని యోచించి - వాడి శరీర భాగాలకు సరిపడే విశాలమైన గోయిత్రవ్వారు. నేలలో లోతుగా పాతిపెట్టారు.

అగస్త్యముని వింధ్యపర్వతానికి గురువు. రామాదులకా ముని కులగురువు. ఆ ముని ఆజ్ఞపాలనతో వింధ్యపర్వతం కదలకుండా స్తంభించిపోయింది.

రామాదులు పంచవటికి చేరుకున్నారు. అక్కడి నుంచి వేరొక ఆశ్రమానికి సాగిపో దలచలేదు. అక్కడే స్థిరనివాస మేర్పరచుకున్నారు. పర్ణశాల నిర్మించుకున్నారు. ఐదు విశాలమైన మఱ్ఱిచెట్లు అల్లిబిల్లిగా పెరిగి ఒకదాని కొమ్మలు, వేరొకదాని కొమ్మలతో పెనగి, చక్కని గుబురుగా అల్లుకుపోయాయి. చల్లని నీడతో వాసయోగ్యమైన భవనంవలె హాయి గొల్పుతున్నాయి. ఆ పంచవటవృక్షాల నీడలో పర్ణశాల నిర్మించుకున్నారు. ఈ ప్రదేశం వింధ్య పర్వత ప్రాంతంలోనిదని, కాళిదాసు మహాకవి వక్కాణించాడు. కాలక్రమేణా ప్రతి ప్రాంతంలోను ఒక పంచవటి వెలసి "ఇక్కడే సీతారాములు నివసించారహో" అని ప్రజలు చాటుకోనారంభించారు. మన భద్రాచల సమీపంలో ఒక పంచవటి ఉన్నది. మహారాష్ట్రలో పడమటి కనుమలలో ఒక పంచవటి ప్రఖ్యాతమై ఉంది. ఇవన్నీ ప్రజలు అభిమాన విశ్వాసాలతో కాలక్రమేణా సృష్టించుకున్నవే!

ఈ పంచవటిలో ఉండగానే రావణుని చెల్లెలు శూర్పణఖ రామునిచూసి మదనబాధ చెందింది. రాముని సమీపించింది. "రమ్ము సుందరా! నన్ను భోగించు" అంటూ అభ్యర్థించింది. ఆ స్థితి ఎలా ఉన్నదని కవిప్రభువు భావించాడోగానీ ఎంతో చిత్రంగా వర్ణించాడు.

"ఎండ గాడ్పులకు తాళలేక ఒక ఆడనాగు - శ్రీగంధవృక్షాన్ని సమీపించి ఆలింగన మొనర్చుకో చూచినట్లున్నదన్నాడు. నిజమేమరి - రాముడు మలయద్రుమం వలె చల్లనివాడే. కాని, ఆ విషనాగుకెలా ఆశ్రయమివ్వగలడు!

ఆమె కేవల కామమోహిత! సమయా సమయాలెరుగదు. ఉచితానుచిత జ్ఞానంలేదు. సీత ఎదుటనే శూర్పణఖ తనను పెండ్లాడమని రాముని బలవంతపెట్ట నారంభించింది. రాముడామెకు సౌమ్యంగా చెప్పనారంభించాడు. "అమ్మాయీ నీ కోరిక మంచిది కాదు. నేను భార్యతో ఉన్నాను. నాకంటె చిన్నవాడు, అందగాడు, లక్ష్మణుడు ఉన్నాడు. సర్వవిధ సమర్థుడు. పైగా భ్యార్యావియోగంలో ఉన్నాడు. వెళ్ళి అతన్ని ఆశ్రయించు".

కాని ఆమె అంతకుముందే లక్ష్మణుని కలుసుకుంది. కోరిక వెల్లడించింది. అతను తిరస్కరించాడు. ఇప్పుడు రాముడు మళ్ళీ యీ సలహా ఇవ్వడంతో అతన్ని చేరింది. పొంగులు వారుతున్న నది - రెండు గట్లనూ తాకుతూ ఆవేశంగా నురగలు క్రక్కుతున్నట్లు ఆమె ఉన్మాదావస్థలో అశాంతిగా కదలిపోతోంది. దాని విచిత్ర స్థితిని చూసి సీత నవ్వుకుంది. ఆమె నవ్వు చంద్రోదయంలా ప్రశాంతంగా ఉంది. కాని పొంగే శూర్పణఖ హృదయాన్ని సాగరోద్ధతితో కలవరపరుస్తోంది. కోపంతో గర్జిస్తున్న ఆడపులిని - వేరొక ఆడులేడి అవమానించినట్లు క్రోధోద్రేకంతో నిందించనారంభించింది.

"ఇదిగో చూడు నా అసలు స్వరూపం"! అంటూ చేటలంత గోళ్ళతో తాళవృక్ష సదృశమైన వ్రేళ్ళతో భయంకర పర్వత స్వరూపంతో ప్రత్యక్షమైంది. దానిని చూసి సీత నిజంగానే భయపడింది.

మొదట సుందరాకారంతో, కోకిల స్వరంతో మాట్లాడిన ఆమె, ఇక నక్క ఊళలవలె కర్ణకఠోరంగా అరుస్తూంటే - లక్ష్మణుడు అది ఎంత మాయావియో, ఎంత భయంకర రాక్షసో గ్రహించాడు. ఆమె కోపంతో కంపిస్తూ, తన నిజస్వరూపంతో పర్ణశాలలో ఉన్న లక్ష్మణుని సమీపించింది. వెంటనే లక్ష్మణుడు ఖడ్గం దూశాడు. ఆమె ముక్కూ, చెవులూ ఛేదించాడు. ఆమెకు మరింత వికృత రూపం కల్గించాడు. ఆమె బాధతో, కక్షతో గగనవీధికి ఎగిరింది. "చూసుకోండిరా నీచులారా! మిమ్మల్నేం చేస్తానో!" అంటూ గర్జిస్తూ పలాయనమైంది.

అలా పోయిపోయి 'జనస్థానానికి' చేరుకుంది. ఖరదూషణాదులకు తన స్థితి చూపింది. గోలుగోలున ఏడ్చింది. వారికీ సహజంగానే ఆగ్రహోదగ్ర స్థితి ఆవరించింది. తన సోదరీ సమానురాలైన శూర్పణఖకు ముక్కు చెవులు తెగకోయడం తమ జాతికే అవమానంగా తోచింది. పైగా అది తమ జాతికి అపశకునమనీ వారు భావించారు. ఆ దుర్మార్గులపై కక్ష తీర్చుకోక తప్పదని నిశ్చయించుకున్నారు. సాయుధులై, రామాదులున్న స్థలానికి పోయి, యుద్ధగర్జన చేసారు. గర్విష్ఠులై తమపైకి దండెత్తి వచ్చిన రాక్షసగణాన్ని చూసి సీతను రక్షించవలసిందిగా లక్ష్మణుని కాజ్ఞాపించాడు రాముడు. ధనుష్పాణిగా యుద్ధ సన్నద్ధుడయ్యాడు తాను.

వేలాదిగా ఉన్న రాక్షసులు, రాముడు ఏకాకిగా యుద్ధానికి సన్నద్ధుడై రావడం చూశారు. కాని వారికెందువల్లనో ఒకే రాముడు వేలాది రూపాలతో సాయుధులైన వేలాది సైనికశ్రేణివలే

కనిపించ నారంభించారు. పైగా వేలాది బాణాలు కురిపిస్తున్నారు. ఆ దుష్టులు ప్రేరేపించగా దూషణుడనే రాక్షసశ్రేష్ఠుడు ముందుకు వచ్చి రాముని ప్రతిఘటించాడు. రాముడు సక్రోధుడై బాణప్రహారం ప్రారంభించాడు. రాముడు ఏకకాలమందు మూడు దివ్యాస్త్రాలు ప్రయోగించి దూషణ, ఖర, త్రిశిరసులనే ముగ్గురినీ ఏకకాలంలో వధించాడు. వేలాది రాక్షససైన్యం నిహతులై కళేబరాలుగా మిగిలారు.

శూర్పణఖ దూరంనుంచే క్రోధంతో నిప్పులు ఉరుముతూ నిలచి ఉంది. ఇందరి మరణవార్తనూ మోసుకు పోవలసిన బాధ తనకు లభించింది. రావణుని వద్దకు పోయింది. యావత్ వృత్తాంతమూ రావణునకు విన్నవించింది. ఆ మాటలు వింటూనే - 'రాముడనేవాడు ఇంత పొగరుతో పాదాన్ని తన తలపై పెడతాడా?' అనిపించి, మహోగ్రుడై పోయాడు. అవమానంతో గర్జించాడు. ఆ కోపంతో తన మేనమామ మారీచుని కడకు పోయాడు. విషయమంతా వివరించాడు. అతని అంగీకారం గ్రహించాడు. మారీచుడు బంగరు లేడిగా మారి, రామాశ్రమ పరిసరంలో తిరుగుతూండాలి. సీతనాకర్షించాలి. రాముడు, ఆ బంగరు లేడిని పట్టుకుందుకు బయల్దేరాలి. నేర్పుగా అతన్ని అతి దూరప్రదేశానికి కొనిపోవాలి. లక్ష్మణుడు కూడా అనుసరించక తప్పదు. అప్పుడు తాను బ్రాహ్మణవేషధారిగా సీతను సమీపించి అపహరించుకు లంకకు కొనిపోవాలి. ఇదీ పథకం. మారీచుడు అంగీకరించాడు. అతని ఆలోచనయే లెస్స అని ఆమోదం పలికాడు. సరిగ్గా రావణుని ఆలోచన ప్రకారమే కథ యావత్తూ జరిగింది. సీతనెత్తుకొని గగనమార్గాన పోతున్న రావణుని జటాయువు అడ్డగించింది. దానితో యుద్ధం చేయక తప్పలేదు. చివరికి దాని రెక్కలు ఛేదించి, ఆలస్యంగా లంకకు తిరిగి వచ్చాడు రావణుడు.

సీతకోసం అరణ్యమంతా వెదకనారంభించారు రామలక్ష్మణులు. సాగగా సాగగా రెక్కలు తెగిన బాధతో మూలుగుతూ పడివున్న జటాయువు వారికి కనిపించింది. దానిని సమీపించి పరికించగా జటాయువు మానవ భాషలో - సీతను రావణుడు ఎత్తుకొనిపోయిన ఉదంతం చెప్పింది. తాను దశరథ మహారాజు మిత్రుడననీ, అందువల్ల ఆ నీచుడ్ని అడ్డగించి ఈ స్థితిలో పడి - ఈ సంగతి చెప్పడానికే బ్రతికి ఉండగలిగాననీ - జటాయువు తెలిపింది. అంతే తానుగా సీతను రక్షించడానికి యుద్ధం చేసినట్లు చెప్పనేలేదు. కానీ రక్తసిక్తమైపోయిన దేహమూ, తెగిన రెక్కలూ, జటాయువు చేసిన సాహస కార్యాన్ని తెల్పుతూనే ఉన్నాయి. జటాయువు ప్రాణవాయువులు అనంతవాయువుల్లో లీనమైపోయాయి. ఆ జటాయు మరణం మళ్ళీ రామాదులకు పితృ మరణశోకాన్ని జ్ఞప్తికి తెచ్చి, దుఃఖం కల్గించింది. వెంటనే దానికి అగ్ని సంస్కారం జరిపారు.

సీతాన్వేషణా కర్తవ్యంతో ముందుకు సాగుతున్న రామ లక్ష్మణులకు కబంధుడనే భయంకరాకారుడు బ్రహ్మాండమంత దేహంతో ఎదురయ్యాడు. రాముడతన్ని తన బాణాలతో చంపగా - వాడు శాపవిముక్తుడైన దేవతగా మారిపోయాడు. రామునితో - "నీవు దక్షిణాభి

ముఖంగా పోయి, కిష్కింధలో ఉండే వానరరాజు సుగ్రీవునితో సఖ్యం చేసుకుంటే నీ కార్యం సిద్ధిస్తుంది సుమా!" అని సలహా ఇచ్చి అంతర్ధానమయ్యాడు.

అతని సలహా ననుసరించి, రామాదులు కిష్కింధకు చేరుకున్నారు. వాలి తమ్ముడైన సుగ్రీవుని కలుసుకుని తనకు జరిగిన అన్యాయం వివరించి, దానిని పరిహరించడానికి సహకరించమని కోరాడు. వెంటనే సుగ్రీవుడు సైతం - తన భార్యను తన అన్న వాలి ఎత్తుకుపోయిన అన్యాయాన్ని నిర్మూలించే సహాయం చేయమని అర్థించాడు. అతని కోరిక ననుసరించి, వాలిని చంపి, సుగ్రీవుని కిష్కింధ రాజ్యాధిపతిగా పట్టాభిషేకం జరిపాడు రాముడు.

రాముడు సీతా విరహాగ్నికి తాళలేకపోతున్నాడు. సుగ్రీవుడా విషయాన్ని విచారించి హనుమాది కపీశ్వరులను సీతాన్వేషణార్థం పంపాడు. వారు అరణ్యమంతా గాలిస్తూ మిక్కిలి శ్రమపడుతున్నారు. జటాయువు తమ్ముడైన సంపాతి దారిలో కనిపించాడు. హనుమాధులను చేరబిలిచాడు. సీత, రావణుని - లంకలో బంధితయై ఉందని వివరించాడు. ఆ మాటతో హనుమంతుడు సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించాడు.

హనుమ - సముద్రాన్ని తరించడం ఎలా ఉన్నదంటే అజ్ఞానరూపమూ, జనన మరణ క్లేశ భరితమూ అగు సంసార సాగరాన్నే నిర్మముడై తరించినట్లున్నదని కాళిదాసుపమించాడు. రావణ రాజధానీ నగరాన్ని ఆంజనేయుడు వెదుకుతున్నాడు. విషపుతీగలు అల్లిబిల్లిగా అలముకుపోయిన సంజీవనివలె - రాక్షస స్త్రీల నడుమ జానకి సాక్షాత్కరించింది.

రాముని అభిజ్ఞానంగా తెచ్చిన అంగుళీయకం సీతకందించాడు. ఆమె వెంటనే ఆ ఉంగరం తన భర్తదేనని గుర్తుపట్టింది. కనులకద్దుకుంది. ఆమె కపోలాలపై ఆనందాశ్రువులు జారాయి. రాముని సందేశమామెకు అందచేశాడు హనుమ. కపి అంశతో అశోకవనాన్ని కసితీరా నాశనం చేశాడు. అక్షయకుమారుణ్ణి వధించాడు. ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి కట్టుబడ్డాడు. కొంతసేపా బాధ అనుభవించాడు. రాక్షసులతని వాలమునకు నిప్పంటించారు. రాక్షసులు అంటించిన మంటలతోనే హనుమ లంకాపురిని భస్మీపటలం కావించాడు.

తనను చూసినందు కానవాలుగా సీత తన తలపై నున్న చూడామణి తీసి ఇచ్చింది. అది ఆమె హృదయంవలె పవిత్రంగా మెరుస్తోంది.

ప్రత్యుత్తరాన్ని సందేశిస్తున్న చూడామణిని రెండు చేతులూ చాపి తీసుకున్నాడు హనుమ. వీలైనంత శీఘ్రంగా స్వస్థలం చేరుకున్నాడు. చూడామణిని రాముని కరకమలాల కందించాడు. రాముడు చూస్తూనే ఆర్ద్రనయనాలతో దానిని తన హృదయానికి హత్తుకున్నాడు. కనులు మూసుకొని ఆమె సుందరరూపాన్ని ధ్యానించాడు. చూడామణి స్పర్శచేతనే సీతాలింగన భావం కలిగి, అతని శరీరం రోమాంచితమైంది. దానితో అతని మనసు ప్రియదర్శన భాగ్యం కోసం తత్తరపడింది.

సాగరమధ్యంలో ఉంది లంక. కాని, అతని ఆత్రతవల్ల అది ఒక కాలువ చుట్టబడిన స్థలావరణగా తోచింది. ఈ సందర్భంలో మహాకవి చెప్పిన శ్లోకం - "కృత్వారామః ప్రియోదంతం

మేనే తత్సంగమోత్సుకం - మహార్ణవ పరిక్షేపం లంకాయాః పరిఖాలఘుమ్" అనేది ఎంతో మనోజ్ఞమైనది.

రాముడు రావణునిపై దండెత్తడానికి సకల ప్రయత్నాలూ ప్రారంభించాడు. కోట్లకొలదిగా ఉన్న వానరులను సైన్యంగా కూర్చుకున్నాడు. సుగ్రీవాదులు ముందు సాగుతూండగా - నేలానింగీ ఏకమైనట్లుంది. అలా దక్షిణాభిముఖంగా సాగి, సాగరతీరం చేరుకున్నారు. అక్కడ విశ్రాంతిగా కూర్చున్నారు. కర్తవ్య మాలోచించారు. రాక్షసజాతి సర్వనాశనం కాకుండా సంరక్షించాలనే సదుద్దేశంతో విభీషణుడు రాముని సన్నిధికి చేరుకున్నాడు. నమ్రతతో, స్నేహపూరిత హృదయంతో రామునికి నమస్కరించాడు. తన నాశ్రయించ వచ్చిన విభీషణునకు మర్యాద పూర్వకంగా అభయం చెప్పాడు రాముడు. "రావణ వధానంతరం లంకాధిపత్యం తప్పక నీకే ఇవ్వగలనని మాట ఇచ్చాడు. సమయానుకూల రాజనీతిజ్ఞతను ప్రదర్శించి శత్రువుల నడుమ నుంచి రాముడు ఒక బలమైన మిత్రుని సాధించుకున్నాడు. వానరులు ఆనందంతో 'లవణాంభసి'పై సేతువు నిర్మించారు.

పాతాళలోకంనుంచి భూతలానికి వచ్చిన ఆదిశేషువులా వుంది సేతువు. ససైన్యుడై రాముడు సాగరాన్ని తరించాడు. వానరసైన్యం లంకను ముట్టడించింది. రావణుని సౌధాలు బంగారుపూతతో మెరుస్తున్నాయి. వానరులు పింగళవర్ణంతో మెరుస్తున్నారు. లంకను చుట్టుముట్టిన వానరుల దేహకాంతి రెండవ బంగరుగోడగా మెరుస్తోందని కవి వర్ణన. వానరులు 'రామునికీ జై' అనే నినాదాలతో విపరీత నాద ముప్పతిల్ల చేశారు.

అది విని రాక్షసులు 'రావణునికీ జై' అంటూ మారు నినాదాలు చేస్తున్నారు. ఆ మహాఘోష దిక్కులు పిక్కటిల్లచేస్తోంది. భయంకర యుద్ధం ప్రారంభమైంది. వానరులు దొరికిన దాన్నల్లా ఆయుధంగా ప్రయోగిస్తున్నారు. వృక్షాలు, శిలలు, సూదిమొనలుగల పాషాణ శకలాలు అసంఖ్యాకంగా సంధిస్తున్నారు. రాక్షసుల శస్త్రాస్త్రాలను ఖండిస్తున్నారు. విద్యుజ్జిహ్వుడనే రాక్షసుడు మాయోపాయం చేత శ్రీరాముని తలను సృష్టించాడు. దానిని తీసుకొని సీతను సమీపించాడు. రావణుడు రాముని వధించాడని ఆ తల చూపించాడు. నిజమేనని విశ్వసించిన సీత వెంటనే మూర్ఛపోయింది. అప్పుడు త్రిజట రహస్యంగా సీత చెవిలో అది మాయాకల్పిత శిరసని సీతకు ధైర్యం చెప్పింది. సీతకు కావలి కాస్తున్న రాక్షస స్త్రీలలో త్రిజట ఒక్కర్తే సీతకు అనుకూలంగా తొలినాటినుంచీ ధైర్యం చెబుతున్నది. ఆమె సపర్యలు చేసి సీతను మూర్ఛనుంచి తెప్పరిల్లచేసింది. మేల్కొన్న సీత - తానెలా ఆ మోసపు మాటను మొదట్లో విచారణ లేకుండా నమ్మగలిగానా అని చింతించింది. రాముని శౌర్యసాహసాలు తెలుసుండే తనకెంత అజ్ఞానం క్రమ్మిందా? అని సిగ్గుపడిపోయింది.

ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగాస్త్ర ప్రయోగం ద్వారా బంధించాడు. ఇంతలో విష్ణువాహనమైన గరుత్మంతుడు అక్కడికి వచ్చి వాలాడు. అతని దర్శన మాత్రానికే నాగాస్త్రం భయంతో నిరుపయోగమైపోయింది. రామలక్ష్మణులకా అనుభవం ఒక స్వాప్నిక దృశ్యంలా అచ్చెరువు కల్గించింది.

తమ శక్తియుక్తులు నిర్వీర్యమవడం చూసి రావణుడాగ్రహ పరవశుడై శక్తి అనే ప్రబలాయుధం ప్రయోగించాడు. అది లక్ష్మణుని వక్షాన్ని తీవ్రంగా గాయపరచింది. ఆ దెబ్బతో మ్రానువలె కూలి లక్ష్మణుడు మూర్ఛితుడయ్యాడు. ఇంత విపత్తూ అనూహ్యంగా ఒక్కమారు తటస్థించడంతో రాముని హృదయం శోకంతో బ్రద్దలైనట్లైంది.

తక్షణమే హనుమ బయల్దేరాడు. మహౌషధిని తెచ్చి లక్ష్మణునికి పట్టించాడు. అతడు గాఢనిద్ర నుంచి మేల్కొన్నట్లు పునఃశక్తిమంతుడయ్యాడు. బాణాలు గుప్పిస్తూ శత్రువులపై విజృంభించాడు.

లంకలోని రాక్షస స్త్రీలెందరో కొత్తగా విగత భర్తృకలై దుఃఖంలో మునిగిపోతున్నారు. ఇంద్రాయుధ శ్రేణితో మిరుమిట్లు కొల్పుతున్న ఇంద్రజిత్తును గురిచూసి లక్ష్మణుడు ఒక భయంకరాస్త్రం సంధించాడు. ఆ దెబ్బతో సింహనాదం చేస్తూ ఇంద్రజిత్తు నేలకూలాడు.

ఇంతలో కుంభకర్ణుడు రణరంగం ప్రవేశించాడు. మణిమయ శిలలు ప్రకాశిస్తున్నట్లు అతని నుంచి ఎర్రని వెలుగు లెగ జిమ్ముతున్నాయి. అంతకు పూర్వమే అతని ముక్కు చెవులను సుగ్రీవుడు నరకగా రక్తసిక్తమై ధారలు కడ్తున్నాయి. రక్తాభిషేకం పొందుతున్న పాషాణమూర్తిలా ఉన్నాడతడు. నిద్రతప్ప మరేదీ ప్రీతిపాత్రం కాని కుంభకర్ణుడు - ఆపత్కాలం సమీపించగా అన్న రావణుడార్తితో మేల్కొల్పగా వచ్చి రణరంగంలో నిలిచాడే కాని, నిద్రలో జోగుతూనే ఉన్నాడు. ఇంతలో రామబాణాహతి తీవ్రతతో వాడు దీర్ఘనిద్రలో మునిగిపోయాడు.

మిగిలిన రాక్షసులమూక - వెనుదిరిగి పరుగులిడుతూ ధూళి రేపుతున్నారు. వాళ్ళను వానరులు వెనుకపట్టుగా చావబాదుతున్నారు. వాళ్ళ రక్తం ధారలు కడుతోంది. ఆ రక్తంతో ఎగురుతున్న ధూళి తడిసి అణగిపోతోంది. బెందడిగా మారుతోంది. ఇలా అసంఖ్యాక రాక్షస సైన్యాన్ని వానరసైన్యం హతమార్చేసింది.

రావణుడు రథారూఢుడై యుద్ధరంగ ప్రవేశం చేశాడు. రాముడు పదాతిదళాధిపతిగా నేలపై నిల్చున్నాడు. ఇంతలో కపిల వర్ణాశ్వాలు పూన్చబడిన రథం వచ్చి రామునిముందు నిల్చింది. రామవిజయం కాంక్షిస్తూ దేవేంద్రుడే పంపాడా అన్నట్లు ఆ రథం శోభస్కరంగా ఉంది. ఆ రథాగమనంతో పాటే - యుద్ధరంగంలో ఒక మలయ పవనోర్మిక సాగివచ్చింది. రథసారథి మాతలి చేయి అందించగా రాముడు రథారూఢుడయ్యాడు.

గగన గంగా తరంగాల చల్లని గాలులతో నిండిన ఆ రథం - రామునికెంతో శైత్యోపచారం చేసింది. ఆ రథాగమనమే ఒక విజయసంకేతంగా భాసించింది. ఇంద్రుడు మాతలి ద్వారా రాముని కోసం వజ్రకవచం కూడా పంపాడు. దానిని మాతలి సహాయంతో రాముడు ధరించాడు. రాక్షసులు ప్రయోగిస్తున్న బాణాలన్నీ కలువరేకులై తాకి జారిపోతున్నాయి.

ఇంతకు పూర్వమే రాముడు - రావణుని సమర పరాక్రమం గురించి వినే ఉన్నాడు. రావణుడు కూడా రాముని శౌర్యోద్ధతి గురించి ఎన్నో కథలు వినే ఉన్నాడు. కానింత వరకూ ఈ మహావీరులకు పరస్పర వీక్షణావకాశం లభించలేదు. ప్రత్యక్షంగా పరస్పరం చూసుకున్నదీ

లేదు. చిరకాలంగా వింటున్న గాథలకు ప్రత్యక్షరూపాలుగా ఒకరికొకరు ఎదురు బొదురుగా ఇప్పుడు నిలిచారు. ఉభయుల యుద్ధకౌశలానికీ చరితార్థమైన పరీక్షా సమయం తటస్థించింది. ఈ సన్నివేశాన్ని కాలం, వేయికళ్ళతో ఉత్సుకతతో చూస్తున్నది.

ఆత్మీయులందర్నీ కోల్పోయిన రావణుడు ఒంటరిగా మిగిలిపోయాడు. అయితేనేం పదితలలు, ఇరవై చేతులుగల విచిత్రవీరుడు కనుక అసంఖ్యాక రాక్షస పరివారం సాయుధంగా తనచుట్టూ ఉన్నట్లే భావిస్తున్నాడు. అతని తండ్రి బ్రాహ్మణఋషి. తల్లి రాక్షసకాంత. తండ్రి నుంచి తపోదీక్ష సంక్రమించినా, తల్లిచారగా తమోగుణమే ప్రధాన లక్షణమై మిగిలింది. క్రౌర్యమే మితిమీరింది. తన శిరస్సులను నరుకుకొని అభీష్టసిద్ధికై హోమంచేసి శివుని ప్రసన్నం చేసుకొన్నాడు. ధీరత్వంతో కైలాసాన్ని బాహువులతో పెకలించి ఎత్తుకున్న బలాఢ్యుడు.

కాని ఇంతవరకూ తన పరాక్రమానికి సమ ఉజ్జీ అయిన శత్రువే ఎదురుకాలేదు. ఇంత శౌర్యాగ్రణి అయిన రావణుడు తనకు ఎదురై నిలిచినందుకు రాముడు సైతం సగౌరవంగా వందనం చేశాడు. రక్తబంధువు లందర్నీ చంపివేసిన ప్రబల శత్రువుపై రావణుడు మాత్రం క్రోధజ్వాల లెగజిమ్ముతున్నాడు. వెంటనే ఒక బాణం సంధించి, రాముని కుడి భుజాన్ని కూల్చ సంకల్పించాడు. దక్షిణ బాహువు కూలిపోతే బాణ ప్రయోగశక్తి కొరవడుతుంది. దానితో తన విజయం నిరాటంకమౌతుంది. కాని ఆ బాణం రాముని భుజాన్ని తాకి జారిపోయింది. ఈ శుభశకునంతో అతని కుడిభుజం శుభసూచకంగా అదిరింది. సీతా సమాగమ శుభముహూర్తం సమీపిస్తున్న భావన అతనికెంతో ఆనందం కల్గించింది.

తొలి బాణ ప్రయోగం రావణునిదే. ఇక రాముడు శరవర్షం కురిపించ నారంభించాడు. అతని బాణాలు రావణుని వక్షాన్ని చీలుస్తూ భూమిలోనికి చొచ్చుకుపోతున్నాయి. స్వర్గలోకానికి ఈ యుద్ధ విశేషాలు చెప్పే వార్తావహులు వలె ఆ బాణాలు వేగంగా పోతున్నాయా అన్నట్లుంది. రామ బాణప్రయోగ సామర్థ్యం చూపరులను చకచ్చకిత మొనరుస్తోంది. రామరావణుల శరప్రయోగ కౌశలం ఎంత ఉధృతంగా ఉన్నదంటే - ఒక మేధా సంబంధ చర్చలో పండితులు వాకోవాక్యంగా ఖండన పరంపరలు సాగిస్తూ వాదోపవాదాలు చేస్తున్నట్లుందని కవికులపతి వర్ణన. అన్యోన్య జయసంరంభంలో వారి బాణప్రయోగం సాగుతోంది.

ఒకమారు రాముడు విజృంభిస్తాడు. వేరొక అవకాశం తీసుకుని రావణుడు శౌర్యోద్ధతి ప్రదర్శిస్తాడు. విజయలక్ష్మి చివరికి ఎవర్ని వరిస్తుందో ఆ దృశ్యం చూసినవారికి చెప్పడం కష్టమే. ఉభయులూ మహాపరాక్రమ సింధువులే. సమ ఉజ్జీగా పోరుసల్పుతున్నారు. పరస్పర శర-వ్రాతాహతి విజృంభిస్తోంది. వీక్షిస్తున్న దేవదానవులిరు వర్గాలూ పుష్పవర్షాలు కురిపిస్తున్నారు. వారి బాణసముదాయమే భూమ్యాకాశాల నడుమ బలమైన పందిరి నిర్మిస్తోంది.

రావణుని విజయయాత్రలో ఎందరో పరాజితులయ్యారు. యముడ్ని సైతం చిత్తుచేసిన వీరుడతను. కూటశాల్మలి అనే అతని గదను అపహరించి తెచ్చుకున్నాడు. ఇనుప సూదుల వంటి బాణాలను ఇప్పుడు రామునిపై కురిపిస్తున్నాడు. తీవ్రనాశనం కల్గించే శతఘ్ని

ప్రయోగించాడు. రాముడు అర్ధచంద్రాకృతి గల బాణాలను ప్రయోగించాడు. రావణుని శతఘ్ని అరటి బోదెవలె ముక్కలై కూలింది.

సీతావియోగ క్లేశానికి కారణభూతుడైన ఈ మహాశత్రువుపై ఇంక జాగు సేయరాదని యోచించి రాముడు బ్రహ్మాస్త్ర ప్రయోగానికి సంకల్పించాడు. ఆ మహాస్త్రం నానారూపాలతో ప్రకాశిస్తోంది. భయంకరంగా నాలుకలు సాచుతూ బుసలు కొడ్తున్న మహాసర్పం వలె ఆకాశమంతా పరుచుకుంది. మంత్రశక్తి నిహితమైన ఆ మహాస్త్రం నిమేషకాలంలో రావణుని తలలన్నిటినీ తునాతునకలు చేసింది. ఈ విచ్ఛేదనాక్రమం అతి వేగవంతంగా జరగడంవల్ల రావణుడు సైతం పోల్చుకోలేక పోయాడు. ఈ కంఠచ్ఛేద పరంపర - రక్తాన్నీ, మాంసఖండాలనూ ఏకధారగా భూపతనం కావిస్తోంది. బ్రహ్మాస్త్రం ప్రసరిస్తున్న అగ్నిజ్వాలలు మహానదీ తటాకాలలో ప్రతిఫలిస్తున్నాయి. సూర్యకాంతుల్ని తరంగితం చేస్తున్నట్లు ఉంది. గతంలో అనేక పర్యాయాలు రావణుని పది శిరస్సులు ఛేదించబడినా, నేలకూలినా ముహూర్తకాలంలో యథాస్థితికి చేరుకొనేవి. ఈ విషయం దేవదానవులందరికీ విదితమే. కాని రామబాణాహతికి కూలిన రావణ శిరస్సులు మాత్రం అపునఃసంధానంగా శిలీభవిస్తున్నాయి. ఈ దృశ్యాన్ని గోప్యంగా దర్శిస్తున్న దేవతలు ఎంతో ఆశ్చర్యపులకాంకితు లవుతున్నారు.

రావణుడు మొదలు నరికిన మ్రానులా నేలకూలాడు. రావణ సంహారం ఆ రీతిగా కావించిన శ్రీరాముని శిరస్సుపై ఇంద్రాదిదేవతలు కుసుమవర్షం కురిపించారు. ఆ సుమ సౌరభం దివ్య వీచికలు ప్రసరించి యుద్ధభూమిలో పేరుకుంటున్న దుర్వాసనా పటలాన్ని చీలుస్తున్నది. రక్త మాంస, నిర్జీవ దేహభరితమైన రణరంగానికి నూత్నశోభ చేకూరుస్తోంది.

రావణ నాశన క్రతువు పూర్తికాగానే - ఇంద్ర రథసారథి మాతలి - "నేను వచ్చిన పని పూర్తయింది. సెలవిప్పిస్తే స్వస్థలానికి వెళ్తాను" అని నమ్రంగా అడిగాడు. ఇంద్రుని రథధ్వజ దండానికి రావణుని నామాక్షరాలుగల బాణాలెన్నో గ్రుచ్చుకొని ఉన్నాయి. వాటిని తీసివేయకుండానే స్మృతిచిహ్నాలుగా ఉంచి ఇంద్ర సదనానికి మరలివెళ్ళాడు మాతలి.

(కవికులపతి - రావణుని గర్భంలో అమృత భాండముందని ఆ రహస్యం విభీషణుడెరిగించి దాన్ని ఛిద్రం చేస్తే తప్ప మరణించడని సలహా ఇచ్చినట్లు చెప్పబడిన అంశాన్ని ఇక్కడ మార్చాడు.)

సీతామహాసాధ్వి, రావణుని ఒద్దికలో ఉండి, అపవిత్రమైందని లోకాపవాదం రాకుండా, అగ్నిపరీక్షతో ఆమెను పునీత కావించాడు. విభీషణునకు రావణ రాజ్య పట్టాభిషేకమొనర్చాడు. విభీషణాదులు అనుగమిస్తుండగా - సుగ్రీవ హనుమంత లక్ష్మణాదులతో విభీషణుడు సమాయత్త మొనర్చిన పుష్పక విమానం అధిరోహించాడు. రావణుడు దానిని కుబేరుని జయించి తెచ్చాడు. అయోధ్యానగరాభిముఖంగా ప్రయాణమయ్యారు.

(ఈ అయోధ్యా నగర యాత్ర ప్రారంభంతో కాళిదాసు రఘువంశం నందలి ద్వాదశ సర్గ సంపూర్ణమైంది. తదుపరి విశేషాలను త్రయోదశ సర్గలో వివరించబోతున్నాడు.)

## త్రయోదశ సర్గ :

సపరివారంగా సీతారాములు గగనయానం చేస్తున్నారు. రాముడు ఉల్లాసంగా ఉన్నాడు. భూమిపై కన్పిస్తున్న వివిధ దృశ్యాలను సీతకు వివరిస్తున్నాడు. 'సీతా! అదిగో చూడు, నీకోసం నేను వానరాగ్రణుల సహాయంతో సాగరానికి అడ్డంగా నిర్మించిన సేతువు! శారదాకాశంలో మెరుస్తూ దర్శనమిస్తున్న పాలపుంతలా భాసిస్తోంది. దానికిరుప్రక్కలా తాకుతున్న కెరటాలు బుడగలు సృజిస్తూ ఫేనమై మెరుస్తున్నాయి. శరత్కాల ఛాయాపథాన్నే జ్ఞాపకం చేస్తున్నాయి. ఈ సాగరానికీ, మా ఇక్ష్వాకు వంశానికీ ఎంతో బాంధవ్యం ఉందని పౌరాణికులు చెబుతుంటారు. వినలేదా? మా వంశ పురుషుడు సగర చక్రవర్తి దీనిని మొదట త్రవ్వనారంభించాడని చెబుతారు!'

"సీతా - సూర్యకిరణ సంయోగంతో గర్భధారిణియై సముద్రమే వర్షాన్ని ప్రసవిస్తోంది. కనక సాగరం లోకోపకారకమే. పైగా అది రత్నాకరం. దానిలోతులు వెదికి తెచ్చుకొని నరులు సంపన్నులవుతున్నారు. సముద్ర జలాలను ఇంధనంగా ఉపయోగించుకొని విద్యుత్తు జనిస్తోంది. దాన్నే బడబాగ్ని అంటారు. స్వప్రాణులకు, సమాహ్లాదకారుడైన చంద్రుణ్ణి సాగరమే ఉద్భూత మొనర్చింది. అందుకే అతని పూర్ణబింబాన్ని చూచినపుడెల్లా ఉత్సాహంతో పొంగిపోతుంది సముద్రం. దీని విస్తృతినిగాని, లోతునుగాని కొలవడం సాధ్యం కాదు. సాధారణంగా స్థిమితంగా ఉన్నట్లే కనిపిస్తుందా - ఒక్కో సమయంలో ఉల్లోలకల్లోలమై ఉన్మత్త పిశాచివలె తాండవమాడుతుంది. దశ-దిశలా వ్యాపించిన సాగరం - మహామహిమాన్వితం. సత్త్వరజస్తమో గుణాలు మూడూ దానికున్నాయి. ఎప్పుడే అవతారంలో దర్శనమిస్తుందో చెప్పజాలం సుమా!" అని చెబుతూ రాముడు కాస్త పస్తాయించాడు.

"సమస్త నదీమతల్లికలూ ఈ గంభీరమూర్తిని తమంత తాముగా వలచి సాగరుని పొందు బిరాన వరిస్తాయి. అప్పుడీతడు నదుల తరంగాధరపానం చేస్తూనే, తన తరంగాధరపానం - వానికిచేకూర్చి సంతుష్టికల్గిస్తాడు. ఈ శక్తి ఎంత విశిష్టతరమో చూశావా?" అంటూ రాముడు - సీతను శృంగార రసాభిముఖ కావించాడు." సాగరంలో నివసించే భయంకరాకారాలు గల తిమింగలాలు, నదులరాక కెదురేగి, తమ నోళ్ళు తెరచి తీయని జలాలతోపాటు చిన్నచేపలనూ ఇతర జలచరాలనూ మింగేస్తుంటాయి. తమ గహ్వరాలలో చేరిన నీటిని తలపైగల రంధ్రాల ద్వారా ఆకాశంలోకి ఎగజిమ్ముతుంటాయి. చూడా దృశ్యం - జలయంత్ర క్రీడను జ్ఞాపకం చేస్తోంది కదూ!" అంటూ సముద్రమధ్యంలో తేలుతూ, నీటిని ఎగజిమ్ముతున్న తిమింగలాలను సీతకు చూపుతున్నాడు రామచంద్రుడు.

(కాళిదాసు మహాకవికి సముద్ర తరంగాల విద్యుత్తు గురించీ, తిమింగలాల గురించీ గల జ్ఞానం ఎంత వాస్తవమో గుర్తిస్తే ఆశ్చర్యం కల్గుతుంది!)

పెద్ద పెద్ద సొరచేపలు. సముద్ర జలోపరితలంలో సంచరిస్తూ జలగజాలవలె కన్పడుతూండటమూ రాముడు చూపాడు. తిరిగి ఇలా అంటున్నాడు.

"సీతా! ఈ సాగరంలోనే కదూ - నీ పెదవులను పోలిన ఎర్రని పగడాలు, నీ ముఖాన్ని పోలిన తెల్లని శంఖాలూ లభిస్తాయి?" అంటూ జానకి ముఖకోమల రేఖలను గోముగా తిలకించాడు రాముడు. "ఈ సాగరం - ఓ మహాచక్రంవలె ఉందా! దాని తీరమందలి తమాల వృక్షాలు, నల్లని అంచుకట్టినట్లు గోచరిస్తున్నాయి. చక్రానికి ఇనుపబద్ది నతికించినట్లు గోచరమవుతోంది కదూ!" అంటూ!

సముద్రజలాల నుంచి ఎగపడుతున్న పవనాలు, తీరమందలి, మొగలిపూల పరాగాన్ని తెచ్చి నీ ముఖాని కద్దుతున్నవి సుమా సీతా!" అని రాముడు చిరవిరహ బాధ నపనయించుకుంటున్నాడు. అతని హృదయం శృంగారభావం వ్యక్తంచేస్తోంది. మన దేశ సముద్రతీరాన్ని వీక్షిస్తూ రాముడు పక్వఫలాల బరువులతో నిండిన పోకచెట్లను చూపిస్తున్నాడు. కాన వనాంతరాలు వారికి కనిపిస్తున్నాయి. విమానం వేగంగా ఉత్తరాభిముఖంగా పయనిస్తోంది. సీత తొడను మృదువుగా స్పర్శించి రాముడు ఆమెకు అరణ్యాశోభ చూపుతున్నాడు. పుష్పక విమానం -తన మనసులోని కోరిక నెరిగినట్లు - దేవమార్గ, మేఘమార్గ, పక్షమార్గములలో సందర్భానుసారం - పైకీ క్రిందకీ గమనం మారుస్తూ సాగుతోంది. భూమిపైగల అనేక నదులు, జలతరంగాలతో వాయువు చల్లబడుతోంది. ఆకాశగాముల ముఖాలను సేదతేరుస్తోంది. మధ్యాహ్నపు ఎండలో ప్రయాణం చేస్తున్నందువల్ల సీత ముఖమండలంలో చిరుచెమట బిందువులు పట్టుతున్నాయి. వాటిని చల్లగాలులు తుడిచివేస్తున్నాయి. ఆ దృశ్యం రామునికెంతో ఆనందప్రదంగా ఉంది. సీత, విమానం వాతాయనం నుంచి తన చేతులు బైటపెట్టింది. మేఘములను దాటుతూ విమానం పోతున్నది. మెరుస్తున్న మేఘరేఖ లామె చేతిని మణికంకణ భూషితగా భాసింపచేస్తున్నవి. రాక్షస భీతివల్ల సురక్షిత ప్రదేశాలకు వలసపోయిన మునులు తిరిగి యథాస్థానాలకు చేరుకుంటున్నారు. రావణవధ వార్త విన్నతర్వాత వారి హృదయాలు నిర్భృతి చెందాయి. తమ జనస్థానాలలో తిరిగి పర్ణశాలలు నిర్మించుకుంటున్నారు.

"ఇదిగో చూడు సీతా! ఇక్కడే - ఇక్కడే సుమా! నీ పాదనూపురం నాకంటపడింది. నిన్నా దుర్మార్గ రావణుడు ఎత్తుకుపోతున్న సమయంలో జారిపోయిన నీ కాలి అందె! ఒంటరిగా నీ పాద వియోగంలో కుములుతూ నిశ్శబ్దంగా నేలపై పొర్లుతోంది. నీ మంజీర దర్శనం నాకు ఏకకాలంలో ఎంతో ఆశావహ స్థితినీ, విరహ వేదనోత్సేకాన్నీ సైతం కల్గించింది. ఆ స్థలమదే చూడు" అంటూ చూపించాడు రాముడు.

(నైషాస్థలీ యత్ర విచిన్వతాత్వాం! భ్రష్టం మయానూపురమేక ముర్వామ్

అదృశ్యతా త్వచ్చరణారవింద / విశ్లేష దుఃఖాదివ బద్ధమౌనమ్

అన్న సుందర శ్లోకంలో (13.23) కవికులపతి మానుష ధర్మాన్ని ఆభరణానికి ఆపాదించి ఎంతో కౌశలంగా చిత్రించాడు.)

"సీతా! నిన్నా దుష్టుడు ఎత్తుకుపోవడాన్ని చూచి ఈ లతలు తమ చికురాకులనే

అరచేతులను వంచి కొమ్మలనే చేతులు చాచి, ఆ మార్గాన్ని నాకు చూపించాయి సుమా! (వృక్ష లతాదులకు సైతం మానవులవలెనే అనుభూతులున్న వన్న సత్యాన్ని ప్రతిపాదిస్తున్నాడు)

రాముని అన్వేషణా మార్గంలో దర్భాంకురాలు కొరుకుతున్న లేళ్ళు, మేతనాపి, రామునిచూస్తూ దక్షిణదిశగా తమ చూపులు సారిస్తూ రెప్పలాడించక నిలుపుతున్నాయి. ఆ అభినయ విశేషంతో రామునిమార్గ సమబోధన కావించాయి. ఆ విషయం రామునికి జ్ఞాపకం వచ్చింది. సీతకు తెలిపాడు. "అదిగో చూడు మాల్యవంత పర్వతం! దాని సమున్నత శిఖరం - మేఘరాశిని తాకుతూ, నూత్న వర్ష బిందువులను తెచ్చి సంతతధారగా కురిపిస్తాయి. అక్కడున్న సమయంలో నీ వియోగభారంతో నా కన్నులు సైతం సరిగా అదే రీతిలో ఉన్నాయి!" నీ విరహజ్వాల దహిస్తుండగా, నాకెంత రుచ్యమైనా సహించేది కాదు. ఈ మాల్యవంతం అత్యధిక వర్షపాతంవల్ల కొండనిండా చిన్నచిన్న పల్వలు (కొలనులు) ఏర్పడి విచిత్ర సౌందర్యం చేకూరింది. కొత్త కొత్త పూలు పూస్తాయి. కింజల్కాలను వెలికి తెచ్చి పరాగ ప్రసాదం చేస్తాయి. ఆ నూత్న పుష్పాల అర్థోర్గత కేసరాలు ఎంతందంగా శోభిస్తాయో! మాల్యవంతంపై కదంబ వృక్షాలెన్నో! నెమళ్ళు, నీలిమేఘరాశిని చూసి నాట్యమాడుతూనే ఉంటాయి ఆ కొండమీద! కాని, నీవులేని గడ్డుబ్రతుకులో ఈ సుందర దృశ్యాలేవీ నాకు ఆకర్షవంతమయ్యేవి కాదు!" అంటూ ఆనాటి బాధాస్మృతుల పునశ్చరణ చేసుకున్నాడు.

"తొలకరి వర్షాలు మెరుపులతో, ఉరుములతో గొప్ప అట్టహాసంగా విచ్చేస్తున్నపుడు ఆపర్జన్య ధ్వానం మాల్యవంత గుహల్లో దూరి ఎంతో తడవు వరకు ప్రతిధ్వనులు కలిగిస్తూంటుంది. ఆ తొలకరి వానల పులకరింతలు నీ సమాగమ సమయాల తలపోతల బరువుతో నా గుండెల నణచేవి!"

"వానకురిసి వెలసినా, పూర్తిగా తడసిన అరటిచెట్లు తమ ఎర్రని పూలకొనల నుంచి జలబిందువులు రాలుస్తూనే ఉంటాయి. మన వివాహ సమయంలో అగ్నిహోత్రునకు హోమం చేస్తున్న సమయంలో వెలువడే ధూమం నీ కన్నులందు చేరి ఎర్రబరుస్తూ బాష్పవారి కురియడం నాకా రోజంతా జ్ఞాపకం వస్తూనే వుంది, గుండె కలుక్కుమంటూనే ఉంది" అన్నాడు రాముడు. సీత నయనాలను 'లోచనశ్రీ' అని వర్ణించాడు. కాంతులను ప్రసరించే ఆమె కన్నుల శోభ తన హృదయంలో విరహార్తిని ద్విగుణీకృత మొనర్చిందని భావం.

మాల్యవంత పర్వత శ్రేణులు దాటింది విమానం. పంపా సరోవర ప్రాంతాన్ని దర్శింపచేస్తోంది. నీటిపై - ఊటికాడ కదులుతోంది. దానిపై కూర్చున్న కొంగలు పడవ ప్రయాణం చేస్తున్నట్లు కదులుతున్నాయి. ఆ సరస్సు నిండా కలువ పూలున్నాయి. అవి కింజల్కాలతో పక్వమయ్యాయి. చక్రవాక పక్షులు, జంటలు జంటలుగా కలువపత్రాలపై కూర్చుని, కింజల్కాలను ముక్కులతో ఏరి పరస్పరం, ప్రేమతో అందించుకుంటున్నాయి. ఆ చక్రవాక మిథునాల ప్రేమాభివ్యక్తిని చూస్తున్నపుడు - "సీతా, నీవే నా హృదయంలో విస్పష్ట రూపంతో దర్శనమిచ్చే దానివి!" అన్నాడు రాముడు.

పంపా సరోవరతటంలో అశోకలతలు, ఉదంతర పుష్పగుచ్ఛాలతో నిలచి ఉంటే నీవే నీవే అనుకుంటూ మనసులో భ్రమాస్పదుడనయ్యే వాడిని! (అశోక వృక్షాలుగాక లతలుకూడా ఉంటాయి. అవి పెద్ద పెద్ద పూలగుత్తులతో శోభస్కరంగా ఉంటాయని కాళిదాసు వర్ణనబట్టి తెలుస్తోంది.)

వాయువేగంతో సాగుతున్న పుష్పకం గోదావరీ పరీవాహ ప్రాంతానికి వచ్చింది. విమానానికి కొసలలో సువర్ణ కింకిణులు అలంకరణగా వ్రేలాడుతున్నాయి. చాలనంలో లలిత ధ్వనులు చేస్తున్నాయి. ఆ శబ్దాలు వింటూ, గోదావరీ నదీతీరంలో మసులుతున్న సారగు పక్షులు - తమ జాతి పిట్టలింకా ఎన్నో వస్తున్నాయని భ్రమిస్తూ, విమానం వైపుగా ఎగిరివస్తున్నాయి. ఆ దృశ్యం చూపుతూ రాముడు - "రమణీయ విహంగాలు, నీ రాక తెలిసికొని స్వాగత మందించడానికి మనవైపుగా వస్తున్నాయి, సుమా!" అన్నాడు.

(ఈ సర్గలో రాముడు విమాన మార్గంలో కనిపించే దృశ్యాలు వర్ణిస్తూ, తన జ్ఞాపకాలు పునశ్చరణ చేస్తూ కేవలం ఏకపాత్రాభినయంగా మహాకవి ఎందుకు రచించాడో కారణం కనిపించదు. సీత హావభావాలు ఇంతవరకూ తెలుపడంగాని, రాముని మాటలకామె జవాబు చెప్పడంగాని కనిపించదు. తనను అగ్నిపరీక్షకు గురిచేశాడే అనే చింత ఆమె హృదయాన్ని దహిస్తూండటం వల్ల మౌనం వహించలేదు కదా అన్న అనుమానమూ కలుగుతుంది. మల్లినాథాది వ్యాఖ్యాతలీ సంశయాన్ని ప్రస్తావించక పోవడం విడ్డూరమే! పైన ఉల్లేఖించిన మాటలలోనే సీత చిరునవ్వుబరపడం గమనార్హం" - అనుకర్త)

(గోదావరీ తీరంలోనే పంచవటి గురించిన స్మృతులు వివరించడం వల్ల కవికులపతి భద్రాచల ప్రాంతంలోని పంచవటినే సమర్థిస్తున్నాడా అన్న అనుమానమూ కలుగుతుంది. ఐదు మర్రిచెట్ల పడుమ పర్ణశాలను నిర్మించుకోవడం, విస్పష్ట స్థల నిర్దేశం లేకపోవడంవల్ల పశ్చిమ మహారాష్ట్రలో గల మరో స్థలాన్ని పంచవటిగా వర్ణిస్తున్నవారున్నారు. కాళిదాసు కాలంనాటికి దక్షిణాగ్ర భాగం చేరువలో సాగరమధ్యాన గల ద్వీపాన్నే రావణుని లంకగా భావించడం పరిపాటి అయి ఉంటుంది. విమాన మార్గ నిర్దేశం కూడా దాన్నే బలపరుస్తోంది.)

"సీతా! అదిగో చూడు - మన చేతులతో నిర్మించుకున్న పంచవటీ ప్రాంత పర్ణశాల! మనం అక్కడే నివసించాం కదా! ఇంత సన్నని నాజూకు నడుం కలదానివే గోదావరి లోతులకు దిగి, కడవ నిండా నీరుముంచి, నడుముకు దాపుపెట్టి ఎలా మోసి తెచ్చేదానివో! ఎలా అన్ని మొక్కలు పెంచేదానివో! అదిగో చూడా బాలచూతం! అప్పుడే ఎంత ఏపుగా పైకి సాగిందో! కనిపిస్తోందా?" అంటూ ఆ ప్రదేశాన్ని చూపుతున్నాడు! "నీవు పెంచిన కృష్ణ హరిణాలెంత గుంపుగా పెరిగాయో చూడు" అన్నాడు.

(కృష్ణాజినం అనగా నల్లలేడి చర్మం. తపస్వులకు పవిత్రమైనదిగా విశ్వసిస్తారు. లేడిజాతిలో నల్లని వాటినే కృష్ణసారాలంటారు తప్ప కొందరు వ్యాఖ్యాతలన్నట్లు మగలేడులనడం పొసగదు.)

వారి దైనిక భోజనార్థం పరిసర అరణ్యప్రాంతంలో వేటాడి, అలసి, తిరిగివచ్చి, రవంత

విశ్రమించ, రాముడు సీత తొడపై తలాన్ని పవళించేవాడు. పంచవటి కనిపించగానే, ఆ మధురానుభూతి మనసును పులకింపచేసింది. కవికులపతి 'అత్రానుగోదం' అంటూ ఇక్కడ శ్లోకం ఎత్తుకున్నాడు. గోదావరికి 'గోద' శబ్దం పర్యాయపదం. పంచవటి సమీపస్థ గోదావరి అనేది గోద శబ్దానికి అర్థం!

ఇంతలో వారికి అగస్త్య మున్యాశ్రమం గోచరించింది. నహుషుడు ఇంద్రపదవిని అధిరోహించాడు. గర్వమతియై అందరినీ ధిక్కరించాడు. అగస్త్యునికి సహజంగా కోపం వచ్చింది. శపించాడు. ఆ తర్వాత ఆయన గోదావరీ తీరానికి వచ్చి లోక కళ్యాణార్థం తపస్సు చేసుకుంటున్నాడు. ఆ అగస్త్యముని శరీర పరిత్యాగం చేసి, నక్షత్ర మండలంచేరి అగస్త్య నామంతోనే భాసిస్తున్నాడు. ఆ నక్షత్ర ప్రభావం వల్లనే శరదృతువు ఏర్పడుతోంది. కశ్మల జలాలను ఆ శరత్కాలమే పరిశుభ్రపరుస్తుంది. ఆ వివరాలన్నీ రాముడు స్మరించుకున్నాడు.

"ఆ అగస్త్య మహాముని త్రేతాగ్నిహోమ తత్పరుడు. ఆ హోమధూమం, మన విమాన మార్గంలో సైతం వ్యాపిస్తోంది".

దట్టమైన చెట్లతో నిండిన ఆ వనంలో ఒక సరోవరం కనిపిస్తోంది. అది మేదుర మేఘాడంబర చంద్రబింబంలా సగంసగం కనిపిస్తోంది. ఆ సరోవరం పేరు పంచాప్సర. నిశిత కర్ణములు గల అగస్త్యముని దానిని క్రీడాసరస్సుగా ఉపయోగించుకునేవాడు (పంచాప్సర - సరోవర పదానికి విశాలమైన నీటిమడుగుగా ఉన్న సరోవరమనే అర్థం చెప్పుకోవాలిగానీ ఐదుగురు అప్సరసలనీ, శాతకర్ణుడనే వేరే ముని శాపవృత్తాంతం తడమడమూ అసంగతమే ననిపిస్తుంది.)

విమానం, పంచాప్సర సరోవర ప్రాంతం దాటింది. సుతాక్షుడనే ముని సూర్యుని కెదురుగా నిలచి తపస్సు చేసుకుంటున్న దృశ్యం కన్పించింది. ఆ వివరాలు తెలిపాడు రాముడు. ఈ ముని తపోభంగానికి సైతం ఇంద్రుడు రంభాదులను పంపాడు. ఆయన దృష్టి చలించలేదు. ఆ ఋషి ఆశ్రమ ప్రాంతాన్ని విమానం దాటింది. శరాభంగ మహర్షి ఆశ్రమాన్ని విమానంలోనించి చూసారు. ఆయన పెంచిన చెట్ల సమూహం మార్గాయాసులకు చల్లని నీడ నిస్తోంది. ఆకొన్న వారికి తీయని ఫలాల నందిస్తోంది. అతిథి సత్కారం చేస్తూ ఆ చెట్లు తమ తండ్రి చేసే సత్కారాలను అనుసరిస్తూ జ్ఞాపకం చేస్తున్నాయి.

శిఖరాగ్రాలపై వాలిన మేఘాలతో చిత్రకూట పర్వతం రాముని దృష్టి నాకర్షించింది. "ఆ కొండ మెడలోని సువర్ణాభరణం రీతిగా మెరుస్తూ, మందాకిని భాతిగా ఒక చిన్న నది ప్రవహిస్తోంది. పరిమళ భరిత పల్లవాలతో తమాల వృక్షాలు పర్వత సానువుల్లో శోభిల్లుతున్నాయి. ఆ చిగురాకులనే నేను తెచ్చి నీకు అవతంసములుగా అలంకరించే వాడిని జ్ఞాపకం ఉందా?" అని అడిగాడు రాముడు. ఆ ప్రాంతంలోనే అత్రి మహాముని ఆశ్రమముంది. ఆ ప్రాంతవనం నిరంతర వసంత భాస్వద్రేఖ!

సప్తర్షులకూ, త్రిమూర్తులకూ ఆతిథ్యమిచ్చేందుకు అనసూయాదేవి గంగానదిని ప్రార్థించి

ఈ ప్రాంతంలోనే ప్రవహింపచేసింది. ఇక్కడి గంగను 'త్రిపథ' అని పిలుస్తారు.

ఇక్కడి వృక్షాలు ఏకపాదంపై నిలిచి వీరాసనంలో నిశ్చలంగా ధ్యానమగ్నులై నిలుస్తాయి. "సీతా! మనం అరణ్యావాస దీక్షలో నడచి నడచి వచ్చి చేరిన మహావట వృక్షం ఇదే! దీన్నే గోధవృక్ష మంటారు. నువ్వు సద్భక్తికంగా 'నా భర్త తన వ్రతపరిపాలన విజయవంతంగా ముగించేట్లు చేయాల'ని ప్రార్థించావు. జ్ఞాపకం ఉందా?" అని అడిగాడు.

(ఈ సందర్భంలో కవికులపతి కాళిదాసు - ఆదికవి వాల్మీకి శ్లోకాన్ని జ్ఞాపకం చేస్తున్నాడు. 'న్యగ్రోధం తముప్థాయ వైదేహీ వాక్యమబ్రవీత్ -నమస్తేస్తు మహావృక్ష - పాలయే న్మేవ్రతంపతిః' అని ఈవనస్పతినే ప్రార్థించిందని వుల్లేఖిస్తున్నాడు. తనకు వాల్మీకి పట్లగల వ్యగ్రతను ప్రకటిస్తున్నాడు.)

(54, 55, 56, 57 సంఖ్యలుగల 4 శ్లోకాలనూ కాళిదాసు మహాసుందరంగా రచించాడు. ఒకే సన్నివేశం వర్ణితమైంది. రాముడు "ఓ సీతా! అటుచూడు, గంగానది యమునా తరంగాలతో మిళితమై ప్రయాగ తీర్థాన్ని మనోజ్ఞవంతం చేస్తోంది. ఇంద్రనీలాలు, మంచిముత్యాలు కలిసి అల్లిన సువర్ణమాల వలె ఒకచోట మెరుస్తుంది. నల్లకలువలతో కలసిన తెల్లతామరల పూలదండలల్లినట్లు మరోచోట భాసిస్తుంది. మరోప్రాంతం కాదంబ పక్షులతో తెల్లని హంసలు గుంపులుకట్టి సంచరిస్తున్నట్లుంటుంది. వేరొక ప్రాంతంలో భూదేవి వక్షంపై గంధలేపనం చేసి కాలాగురు పత్ర రచన చేసిన రీతిగా మెరుస్తుంది. ఆ ప్రక్క చూడు! చెట్లు వరుసలుగా చేరి కుడ్యనిర్మాణం చేసినట్లున్నాయి. అక్కడ చీకట్లతో వెన్నెల కూడియాడు తున్నట్లుంటుంది. మరోచోట విడివిడిగా తేలుతున్న శారద జలద పంక్తుల నడుమనుంచి కనిపిస్తున్న నీలిరంగు ఆకాశంలా మెరుస్తుంది. చూడీ కృష్ణ సరస్సులో శ్వేతవర్ణ శరీరుడైన శంకరుడు జలక్రీడలాడుతున్న ట్లుంది......." అంటూ గంగా యమునల సంగమ స్థలాన్ని వర్ణించాడు రాముడు.)

అంటే గోదావరీ పరీవాహ ప్రదేశంనుంచి విమానం ఎంత దూరం వచ్చిందో మనం గ్రహించుకోవచ్చు! కాళిదాసు వర్ణించిన విమానమార్గం భారతదేశ దక్షిణాగ్ర భాగంనుంచి - మధ్యగా ప్రయాగక్షేత్రం వరకూ నిడువుగా సాగిందన్న సంగతిని తెల్లంచేస్తోంది. కావేరి, పినాకిని, కృష్ణ, నర్మదాది నదీనదాలను స్మరించకపోవడం - అవి పడమటి దిశగా ఉండిపోవటమే కారణం. పుష్పకం తూర్పుతీర రేఖనే అనుసరించి ప్రయాణించిందని కాళిదాసు ఊహించడంలో అసంగతం లేదు. ఇక్కడ 4 శ్లోకాలను అనుస్యూతార్థంలో కూర్చి వర్ణించే పద్ధతిని కల్పకమంటారు.

"గంగా - యమున సంగమస్థానం పరమ పవిత్రమైనది సుమా సీతా!" అంటూ రాముడు ముందుకు చూపుతున్నాడు. "ఇదిగో చూడు - ఇక్కడే మనల్ని గుహుడు గంగాతరణం చేస్తూ, దుఃఖిస్తూ గొంతెత్తి బిగ్గరగా "కైకేయీ! కామాః ఫలితాస్తవేతి!" అని కేకవేశాడు. ఇక్కడే నేను

రాజ లాంఛనాలను పూర్తిగా విడిచి రత్నకిరీటాదులు తీసివేసి జటధారిగా మారాను. జ్ఞాపకం ఉందా?" అన్నాడు. (ఈ విమానయానం పొడుగునా, రాముడే మాట్లాడటం, సీత చిత్తరువువలె ఉండిపోవడం ఎలా ఔచిత్యమనుకున్నాడో మహాకవి - అనూహ్యమే!)

"హైమవత్ పర్వత ప్రాంతమందలి మానస సరోవరమనే సువర్ణ కమల స్థానమే - సరయూ నది జన్మకు కారణమని పెద్దలు చెబుతారు. ఆ సరోవర జలమే - ఈ నది రూపంగా క్రిందికి ప్రవహించింది. అది ప్రత్యక్షంగా కనిపించేది కాదు. అవ్యక్తస్థితిలో మహత్తరం కలుగునని సాంఖ్యదర్శనం చెప్పినట్లే మనమీ సంగతినీ నమ్మాలి" అని రాముని నోట కాళిదాసు 60వ శ్లోకంలో చెప్పాడు. ప్రత్యక్ష ప్రమాణాలు కాక పరోక్ష ప్రమాణాలు కూడా అంతే ముఖ్యమై రసావతరణ కావించగలదని మహాకవి ఉద్ఘాటన!

"అదిగో చూడు సీతా! మా వంశకర్తలు నిష్ఠాపరులై అశ్వమేధ యాగాలు విజయవంతంగా జరిపి అవభృథస్నానార్థమై నాటిన యూపస్తంభాలు నేటికీ నిలచే ఉన్నాయి. మనం అయోధ్య నగరానికి సమీపిస్తున్నాం. ఎంత ఆనంద సన్నివేశమిది!" అంటూ నిట్టూర్చాడు రాముడు.

"ఈ సరయూనదీ తీర పుణ్యస్థలాలు మెత్తని శయ్యాలపై పవళించి, ఈ నదీమాత మధుర క్షీరోదకములు గ్రోలి, మా ఉత్తరకోశలాధిపతులంతా పుష్టినందారు. ఈ సరయూనది ఒక దాదివలె ప్రేమతో పెంచిపోషించింది. అందుకే ఈ నదిపట్ల నా హృదయంలో ఎంతో గౌరవ భావం కల్గుతుంది సీతా!" అన్నాడు రాముడు. "నా తల్లి కౌశల్య వలెనే ఈ నది మా తండ్రి నియమనిష్ఠలను పాలించేది. ఆయన విగతజీవుడైనందువల్ల, పుత్రుడనైన నేను దూరస్థుడ నైనందువల్ల సరయూనది దుఃఖితమతిగా కుంగుతూ ఉన్నట్లు కన్పిస్తోంది. ఇపుడు మనం తిరిగి వెడ్తున్నందున ఆ సంతస తరంగహస్తాలు సాచి కౌగలించుకో బోతున్నట్లుగా ఉంది" అంటూ రాముడు తన మనోవేదన వెలిబుచ్చాడు.

"అదిగో ధూళి లేస్తోంది. మనవైపుగా వస్తోంది. ఈపాటికి హనుమంతుడు వెళ్ళి భరతాదులకు మన రాక తెలిపి ఉంటాడు. సపరివారంగా మనకు స్వాగతం చెప్పటానికి వస్తున్నాడనుకుంటాను. చూడు" అన్నాడు రాముడు. అతనే అర్ధప్రకాశంగా - "తండ్రి ఆజ్ఞ మేరకు అరణ్యవాస క్లేశాలను భరించిన సమయంలో నా రాజ్యాన్ని సంరక్షించి, తిరిగి నాకు అప్పగించడానికి ఉత్సుకతతో భరతుడు ఉవ్విళ్ళూరుతూంటాడు" అనుకుంటూ ఆశావహంగా రాముడు సంతృప్తి పొందాడు.

ఆకాశమార్గంలో రాముడు అలా సంతృప్తి పొందుతున్న సమయంలోనే భూమిపై ప్రజల సమూహం కనిపించింది. వశిష్ఠుని ముందుంచుకొని, మంత్రి సామంతాదులతో అర్ఘ్యపాద్యాది పూజా ద్రవ్యాలతో నారచీరలు ధరించిన భరతుడు కనిపించాడు. తనకు స్వాధీనమైన,

రాజ్యరమను పూర్తిగా అనుభవించక భరతుడు అసిధారావ్రతంగా సంరక్షక బాధ్యతలు స్వీకరించాడు.

"నా తమ్ముడు ధర్మాచరణ పరాయణుడు" అంటూ ప్రశంసించాడు. రాముడీ మాటలంటున్నపుడు ఎవరో తన్ను ఆజ్ఞాపించినట్లు భరతాదుల వైపు దిగి భూమిపై వాలింది. అప్పుడు రాముడు సుగ్రీవునిచేయి ఆలంబనగా పట్టుకొని విభీషణుడు స్ఫటిక సోపానాలు చూపుతూ ముందు నడువగా, సీతకు చేయి అందించి క్రిందకు దిగాడు.

తమకు స్వాగతం చెప్పనున్న పరివారానికెదురేగాడు. సశాస్త్రీయంగా వశిష్ఠునికి నమస్కరించాడు. ఆనందాశ్రుముఖుడైన భరతుని కౌగలించుకున్నాడు. అందరినీ ప్రేమతో కుశలమడుగుతూ సంతోషాంతరంగుల నొనర్చాడు. మీసములు, గడ్డాలు దట్టంగా పెరిగిన వృద్ధమంత్రులు ఊడలు పెంచిన మర్రిచెట్లవలె నీడనిస్తున్నట్లున్నారు. రాముని కాపద్బాంధవులైన సుగ్రీవ, విభీషణాదులకు, అన్నగారైన లక్ష్మణునకూ భరతుడు సభక్తికంగా నమస్కరించాడు. తనతో, వానరాగ్రణులందరినీ అయోధ్యాపుర ప్రవేశం చేయవలసిందిగా ఆహ్వానించాడు. మానవ రూపాలొందమని అర్థించాడు. అందరూ మత్త గజాలనధిరోహించి ముందుకు సాగారు.

తనతోపాటు పుష్పకంపై వచ్చిన పరివారంలోని వారినందరినీ ఎవరికే వాహనాలుచితమో యోచించి ఏర్పాటూ చేశాడు. భరత లక్ష్మణ సీతా సమేతుడై రాముడు మళ్ళీ విమానం ఎక్కాడు. బుధ బృహస్పతులతో కూడిన చంద్రుడు మెరుపు తీగలతో కూడిన మేఘము నెక్కినట్లు వారు భాసించారు.

శరదృతువు మేఘమండలం నుంచి చంద్రుని రక్షించినట్లు, రావణుని చెరనుంచి సీతను విముక్తంచేసి రాముడు తెచ్చాడు. ఆమెకు భరతుడు సభక్తికంగా నమస్కరించాడు. రామునికోసం తన పాతివ్రత్యం కాపాడుకున్న సీత పాదాలు అన్నకోసం రాజ్య సంరక్షణార్థం దీక్షబూని జటధారియైన భరతుని శిరస్సును కలుసుకొని పరస్పర పవిత్రీకరణ మొనర్చుకున్నట్లున్నాయి.

జనమంతా ముందు నడుస్తున్నారు. విమానం మందంగా సాగుతోంది. ముందుగా ఏర్పాటుచేసిన అయోధ్యానగరోపవనంలోని పందిరివద్దకు రామాదులు, శత్రుఘ్నులు చేరుకున్నారు. అయోధ్యానగర వాసులందరికీ సీతారాములు దర్శనమిచ్చారు. అందరినీ అభినందించారు. నగర ప్రవేశం చేశారు!

## చతుర్దశ సర్గ

లతలు తమకంతో ఒక మహావృక్షాన్ని అల్లుకొని ఉన్నతోన్నతంగా పెరుగుతుంటాయి. ఆ సమయంలో ఆ మహావృక్షాన్ని నరకివేయగా లతలు నేలపైపడి పొర్లుతుంటాయి. గాథ

శోచనీయ స్థితిని అనుభవిస్తాయి. సరిగా అదే రీతిగా కౌసల్యాది మహారాణులు దుఃఖితమతులై కుములుతున్నారు. అట్టి తల్లులను తక్షణం చూసిరావాలన్న కుతుకంతో రామలక్ష్మణ/లు వెళ్ళారు. తల్లుల దుఃఖాకువిత స్థితని చూశారు. తమకూ విషాదం ముంచెత్తింది. తల్లుల దుఃఖాకులిత స్థితిని చూశారు. తమకూ విషాదం ముంచెత్తింది. తల్లులు కౌసల్యా సుమిత్రలు రామలక్ష్మణుల రాకతో పెల్లుబికిన దుఃఖంతో కన్నులనిండా అశ్రుజలాలు తెరలు క్రమ్మగా, వారి ప్రస్తుత ముఖరేఖలను స్పష్టంగా చూడలేకపోయారు. కాని, వారి దేహాలింగన స్పర్శతో మాత్రం మాతృత్వ సహజ రోమాంచితం కల్గింది. తల్లుల హృదయాలలో కల్గిన ఆ అనుభూతి అనిర్వచనీయమే. కేవల అనుభవైకవేద్యమే తప్ప మాటలతో చెప్ప సాధ్యం కాదు. రామ లక్ష్మణులు అరణ్యావాస క్లేశాలతో ఇన్ని నాళ్ళు ఎంత కష్టపడిపోయారో అన్న బెంగతో తల్లులు గుండెలు కనలి, వేడివేడి కన్నీటిధారలు కురిశాయి. కాని, వారు సుఖులై, క్షేమంగా తిరిగి రాగల్గిన ఓదార్పుతో ఆనందబాష్పాలు చల్లగా జారుతున్నాయి. కౌసల్యా సుమిత్రల పరిస్థితి గంగా - సరయూ నదులవలె ఉంది. వేసవి ఎండ తీవ్రతకు ఉష్ణోదకంగా మారుతున్న హిమనీరం ప్రవహించి రాగా చల్లబడుతున్న స్థితిని జ్ఞాపకం చేస్తున్నవి. పుత్రుల శరీరాల నాతల్లులు మృదువుగా తాకుతూ ఆప్యాయనంగా నిమిరారు. తామా వీరమాతలమన్న స్పృహతో వీరులైన తమ కుమారుల దేహస్పర్శ వారి హృదయాలను పులకింపచేసింది.

ఆచారం ప్రకారం సీత తన పేరు చెప్పుకొని అత్తలకిరువురికీ సమాన గౌరవంతో నమస్కరించింది. వైధవ్యం సంభవించగా, అత్తల ముఖాలలో కల్గిన పెనుమార్పుల కామె హృదయం క్షోభించింది. పాదాలకు నమస్కరిస్తున్న సీతను "బిడ్డా! లే అమ్మా! నీ వినిర్మల ప్రవర్తన వల్ల నీ భర్త తన తమ్మునితో సహా విపరీత దుఃఖాన్ని తట్టుకోగలిగాడు" అంటూ కౌసల్యా సుమిత్రలు ప్రియమారగా సత్యవచనాలతో కోడలినెత్తి కౌగలించుకున్నారు.

తల్లులిరువురూ శోకానంద బాష్పవారలతో రాముని మస్తకంపై చేసిన అభిషేకంతో ప్రారంభమై వృద్ధులైన మంత్రులు, సామంతులు బంగరు బిందెలతో తెచ్చిన గంగా యమునా తోయాలతో రామ పట్టాభిషేకం మహోత్సాహంగా జరిగింది. వానర రాక్షస వీరులైన హితులు సైతం సకల నదీ సాగరోదకాలు తెచ్చి రాముని శిరస్సుపై అభిషేకం చేశారు.

వింధ్య పర్వత శిఖరంపై వర్షజలంవలె మనోహరంగా ఉందా దృశ్యం. వారందరూ తెచ్చిన వెన్నెన్నో కలశాలు! రాజసమూర్తిమంతనంతో ఎంతో శోభస్కరంగా భాసించే రామునికి పట్టాభిషేక సమయోచిత మణిమయ కిరీటాన్ని రత్న కంకణాలనూ అలంకరించగా రాజేంద్ర శోభాగరిమ చేకూరిందని చెప్పడం పునరుక్తే!

అనంతరం సర్వజనులూ ముందు నడువగా రాముని అయోధ్యా నగర వీథులలో ఊరేగించారు. వృద్ధమంత్రులు, రాక్షస, వానర వీరులు జయజయధ్వానాలు పలుకుతున్నారు. మంగళవాద్యాలు పిక్కటిల్లుతున్నాయి. తూర్యారావాలు ఆకాశంలో ప్రతిధ్వనిస్తున్నాయి. పురజనులంతా కోలాహలంతో నాట్యాలు చేస్తున్నారు. సుమంగళులు మేడలపై నుంచి పేలాల వానలు కురిపిస్తున్నారు. ఊరేగింపు టుత్సవం ఆనందోత్సాహాలతో పురవీథులలో సాగుతోంది.

రథంపై నలుగురన్నదమ్ములూ సామాది చతురుపాయల వలె భాసిస్తున్నారు. శత్రుఘ్నుడూ లక్ష్మణుడూ మెల్లగా చామరములు వీచుతున్నారు. భరతుడు రామునికి ఛత్రం పట్టాడు. ముగ్గురు తమ్ములతో కూడిన రాముడు ధర్మపాలనా దీక్షాదక్షుడై భాసిస్తున్నాడు.

పట్టాభిషేకానంతరం రాజప్రాసాదం నుంచి బయటకు రాముడు వస్తున్నపుడు కాలాగురుధూమం విరాజిల్లింది. ఆ పరిమళ ధూమాలను గాలి అయోధ్యా నగరమంతటా వెదజల్లింది. రాముడరణ్య వాసానికి వెళ్ళాడన్న బాధతో అయోధ్యానగర శోభిని తన కేశపాశాన్ని నిర్లక్ష్యం చేయగా జడలు కట్టాయి. వాటిని రాముడు జాగ్రత్తగా విప్పుతున్నాడా అన్నట్లుగా ఈ పరిమళ ధూమరేఖ కానవస్తోంది.

అరణ్యవాస వేషాన్ని పూర్తిగా తొలగించి సీతను అత్తలు రాజమహిషీ సముచిత భూషణాదులతో అలంకరించారు. రథాసీన అయిన సీతను ఆత్మీయ దృక్కులతో వీక్షిస్తూ పురజనులు అంజలి ఘటిస్తున్నారు. నగర స్త్రీలు తలలు వంచి చూస్తూ నమస్కరిస్తున్నారు. సీతకు అనసూయాదేవి సమర్పించిన అంగరాగం యిప్పటికీ చెక్కుచెదరలేదు. దానికితోడు మహారాజ్ఞి వేషంలో ఇనుమిక్కిలిగా శోభిస్తోంది. ఎర్రని కాంతులతో ఆమె శరీరం శోభిస్తోంది. ఆమె లంకలో చిరకాలం వాసం చేసివచ్చినా రాముడగ్ని పరీక్ష చేయించినా ఆమె శరీరం సముచిత పరిశుద్ధమేనని నిరూపిస్తున్నట్లుగా ప్రకాశిస్తోంది.

సౌజన్యమూర్తీభావమైన రాముడు - సుగ్రీవాదులకు సకల సౌకర్యాలతో కూడిన విడుదు లేర్పాటుచేయించాడు. తన తండ్రి చిత్రపటం అలంకరించిన ప్రత్యేక గృహం సర్వుల పూజలూ పొందుతోంది. రాముడా గృహ ప్రవేశం చేస్తున్నంతనే అతని కన్నులు జలమయమయ్యాయి. పితృవియోగ దుఃఖం ముంచెత్తింది. ఆలేఖ్యమునకు సభక్తికంగా నమస్కరించిన వెంటనే సవతితల్లి కైకేయి ఇంటికెళ్ళాడు. ఆమె రాముని మొగం చూడలేకపోయింది. ఇంతవరకూ చాటుమాటుగా ఉండి పోయింది. రాముడామెను సమీపించి - "అమ్మా మా తండ్రిగారిని సత్యవాక్య భంగం లేకుండా కాపాడి ఆయనకు స్వర్గసుఖాలందించావు. నీవాపని చేయకపోతే ఆయన పూర్వసుకృతాలన్నీ చెరిగిపోయేవే! ఈ సుకృత మొనర్చినందుకు నీవు సగర్వంగా సంతోషించాలి తప్ప - విచారంతో సిగ్గుపడవలసిందేమీ లేదు" అన్న ఓదార్పు వాక్యాలతో కైకేయి తల ఎత్తింది. రాముని సాదరంగా చూసింది. ఆమె హృదయ భారమంతా తొలగి, తేలిక పడినట్లయింది. భరతుడు నందిగ్రామం నుంచి వచ్చీరాగానే తల్లిని నానా దుర్భాషలాడాడు. ఆమె అప్పటినుంచీ దెబ్బతిన్న గువ్వలాగా ముడుచుకుపోయింది. క్రుంగిపోతోంది. రాముని తీయని మాటలకు ఆమె హృదయాఘాతాలకు శైత్యోపచారం కలిగింది.

రావణవధ వార్త విన్న అగస్త్యాది దేవమునులు రాముని అభినందించ స్వయంగా విచ్చేశారు. వారినందరినీ సగౌరవంగా రాముడు సత్కరించాడు. అగస్త్య మహాముని ద్వారా తాను సంహరించిన రావణుని వంశ చరిత్రను అంతా విన్నాడు రాముడు.

తనతో పోరాడి ఓడినవాని గొప్పతనం వింటూ రామునికీ శౌర్యాతిశయంతో పొంగింది.

రాముని సత్కారాలందుకొని మునులు తమ తమ నెలవులకు వెళ్ళారు. అయోధ్యానగరంలో హాయిగా పదిహేను దినాలు గడిపిన సుగ్రీవాదులు, విభీషణాదులూ రాముని సెలవు తీసుకున్నారు. సీత తన హస్తములతో వారందరికీ నూత్న వస్త్ర భూషణాదులను అందచేయగా వారు సభక్తికంగా స్వీకరించారు. సీతా రాములకు పాదాభివందన మాచరించారు. స్వగృహాలకు పయనమయ్యారు. ఆత్మీయ బంధుమిత్రులు గతార్ధమాస కాలం కంటే ఎక్కువకాలం గడపకూడదన్న లోకమర్యాదనే వారు పాటించారు.

రాముని వశమైన పుష్పకవిమానం అధిపతి సంకల్ప మాత్రంగా ప్రవర్తించగల మహిమాన్వితం. అది ఆకాశమార్గంలో సంచరిస్తున్నపుడు ఒక అలంకారంగా భాసిస్తుంది. అట్టి అమూల్య వస్తువును కుబేరుని జయించి రావణుడెత్తుకువచ్చాడు. కనక దానిని తిరిగి కుబేరునకు చేర్చడమే మర్యాద. ఆ విధంగా పయనించమని పుష్పకానికి అనుమతి నిచ్చాడు రాముడు. వెంటనే బయల్దేరి విమానం వెళ్ళిపోయింది.

తండ్రి ఈప్సితార్ధం సుదీర్ఘకాల వనవాస మాచరించి, తిరిగి విజేతగా వచ్చి పట్టాభిషిక్తుడైన రాముడు, ధర్మార్థ కామాల వంటి ముగ్గురు తమ్ములనూ సమాన సమాదరంతో పాలిస్తున్నాడు. తమ ముగ్గురు తల్లులయెడ సమాన భక్తి గౌరవాలతో సుపుత్రునిగా కొలుస్తున్నాడు. ప్రజలందరికీ కావలసిన సదుపాయాలు చేకూరుస్తున్నాడు. సకల విఘ్నములనూ తొలగించి, సత్కర్మానుష్ఠానం జరుపుతున్నాడు. సర్వజనానికీ త్రాతగా, తండ్రిగా కరుణాళువై పాలిస్తున్నాడు. వారి దుఃఖాలు తొలగిస్తూ పుత్రసమానుడై మెలగుతున్నాడు.

ప్రజాహిత కార్యక్రమాలను సమయోచితంగా నెరవేరుస్తున్నాడు. సౌఖ్యానుభవం కోసం త్వరపడుతూ సీత భర్త ననుసరిస్తోంది. ఆమె సకల లక్షణ లక్షిత. కేవల లక్ష్మీప్రతిరూపంగా భాసిస్తోంది. వారిరువురూ అభీష్ట సుఖపరంపరలతో తేలియాడుతున్నారు. సీతారాముల వనవాస సంఘటనలను చిత్రపటములుగా తీర్చి కళాకారులు రాజనగరు గోడలపై అలంకరించారు.

సకల సౌఖ్యానుభూతులతో పరవశిస్తున్న సీతారాములా చిత్రపటాలను తిలకిస్తూ - ఆనాటి ఆరణ్యక సన్నివేశాలను జ్ఞాపకం చేసుకుంటున్నారు. తామిరువురూ కలసి మెలసి గడిపిన దినాల సౌఖ్యానుభూతులు వారిని పులకింపచేస్తున్నాయి. రావణాపహరణానంతరం సంభవించిన విరహ పరితాపాది పూర్వకష్టాలనూ స్మరించుకుంటున్నారు. సహజంగా పంచేంద్రియాలూ కాంక్షించే స్పర్శ, రూప, శబ్ద, రస, గంధాలనే పంచార్థాలనుఅనుభవించడం లోకధర్మమే!

సీతారాములు కొంతకాలమీ విధంగా దాంపత్య సుఖాలనుభవించారు. ఆనందయితీ పరిణత మనస్కులవుతున్నారు. ఇంతలో సీత మొగంలో మార్పులు పొడసూపుతున్నాయి. కన్నులు జిడ్డుతీరుతున్నాయి. ముఖం - రెల్లుపూలవలె పరిపాండురమౌతోంది. కపోలాలు నునుపుదేలుతున్నాయి.

ఆమె గర్భవతి అయినట్లు అంతఃపుర కాంతలు గ్రహించారు. రాముడెంతో ఆనందించాడు. ఆమె శరీరం కృశిస్తోంది. స్తనాగ్రాలు నల్లబడుతున్నాయి. మాటమాటికీ సిగ్గు ఆమెనావహిస్తోంది. ఆమె మనసులో ఏదో కోరిక ఉందని రాముడు గ్రహించాడు. ఏకాంత మందిరంలో ఆమెను

తన యొడిలో కూర్చుండబెట్టుకొని, "ప్రియసఖీ, నీ మనసులోని కోరిక ఏదో తెలుపు" అంటూ అడిగాడు. "నాకు గంగాతీరస్థ తపోవనంలో కొన్నాళ్ళుండాలని ఉంది. నీవార ధాన్యాలు సేకరిస్తూ, యోగ్యురాళ్ళగు మునికాంతలతోనూ, కన్యలతోనూ విహరిస్తూ దర్భాదులను సేకరిస్తూ గడపాలని కోరికగా ఉంది" అంటూ వెల్లడించింది.

"నీ కోరిక తప్పక తీరుస్తాను సీతా!" అంటూ గోముగా సీతను కౌగలించుకుని ముద్దుపెట్టుకున్నాడు రాముడు.

అయోధ్యానగర వాసులెలా సుఖంగా కాలక్షేపం చేస్తున్నారో చూడాలనిపించి రాముడొకనాడు సౌధ శిఖరోపరిస్థలికి వెళ్ళాడు. సేవక జనం అనుసరించారు. క్రయవిక్రయాల కోసం ఇతర నగరాల నుంచి వచ్చిన జనంతో విపణివీధిలో కలకలం ముచెత్తింది.

వస్తు సమృధతో అంగళ్ళు క్రిక్కిరిసి ఉన్నాయి. రాజవీధి జనసమ్మర్ధంతో ముచ్చట గొల్పుతోంది. సరయూనదిలో ఓడలపై సామానులు చేరేసిన పడవలు సాగరాభిముఖంగా సాగుతున్నాయి. నగరమంతటా ఆనందోత్సాహాలు....విలాసాలు వెల్లివిరుస్తున్నాయి. నగరోద్యాన ప్రదేశమంతా పురజనులతో నిండి వుంది. ఈ దృశ్యాలన్నీ రాముని కానందం కలిగించాయి.

తన ప్రవర్తన గురించి రామునికి పూర్తిగా తెలుసు. మాటలో, ప్రవర్తనలో, శరీర సౌందర్యంలో, బలపరాక్రమంలో ఏ లోపమూ లేనివాడే. కాని ప్రజలు, తనను గురించి ఏమనుకుంటున్నారో, ఆ విషయం తెలుపమని భద్రుడనే గుప్తచరుణ్ణి అడిగాడు. వాడు సందేహించ నారంభించాడు. రాముడు నొక్కినొక్కి వత్తిడి చేశాడు. చెప్పక తప్పలేదు. "ప్రభూ! రావణగృహ నివాసం చేసిన సీతాదేవిని మీరు స్వీకరించిన విషయంలో తప్ప మిగిలిన మీ చరిత్రను యావత్తూ ప్రజలు నుతిస్తున్నారు" అంటూ అర్ధోక్తిగా చెప్పాడు.

తనకు ప్రాణంలో ప్రాణమైన సీత మహాపతివ్రత. అగ్నిపునీత! ఆమె గురించి ప్రజలింకా సంశయిస్తున్నారన్న సంగతి విని విచలితుడయ్యాడు రాముడు. సీతా మహాదేవికింకా ఈ అపకీర్తిని ప్రజలంట గడుతున్నారా? అనుకుంటున్న రాముని హృదయం వ్రయ్యలవుతోంది. ఇక్కడ కవికులపతి - అగ్నిలో కాల్చిన ఇనుము - సమ్మెట దెబ్బలచే ముక్కలైనట్లుగా అతని హృదయం వ్రయ్యలైందని ఉపమించాడు.

కొంతసేపు కింకర్తవ్యతా విమూఢుడయ్యాడు. ఈ అపవాదును తృణీకరించడమా? లేక ఈ మాట పట్టుకొని, నిర్దోషి అయిన భార్యను అరణ్యంలో విడిచిరావడమా? అనే సంశయం సుళ్ళు తిరుగుతోంది. అపకీర్తి మరణం వంటిది. నిష్కళంక యగు భార్యను పరిత్యజించడం మహాపాపకార్యమే. మరెలా? పైగా ఆమె చూలాలు. కర్తవ్యాన్ని అతని హృదయం తెమల్చుకోలేక పోయింది. వ్యాకులపడుతోంది.

ఏమైనా ఈ అపకీర్తిని పరిహరించుకోవాలంటే - సీతాపరిత్యాగం తప్ప వేరే కర్తవ్యం కనిపించలేదు. నిర్ణయించుకున్నాడు. కీర్తి శరీర సంరక్షణమే ప్రధానలక్ష్యమని నిర్ణయించు కున్నాడు.

ఈ తలంపు రాగానే అతని వదనం ఖిన్నమైపోయింది. తమ్ములు ముగ్గుర్నీ రహస్య మందిరానికి రమ్మన్నాడు. తాను విన్న సంగతి వివరించాడు. లోకనిందా పరిహరణ కర్తవ్యమేమిటని అడిగాడు.

“ఇంటిగోడకు గల నిలువుటద్దంపై గాలివానకు చినుకులేర్పడ్డాయి. దర్పణాన్ని కాంతివిహీనం చేశాయి. ఈ అపవాదువల్ల సూర్యవంశానికీ, సదాచార చట్టబద్ధమైన ఇక్ష్వాకు వంశానికీ ఎలాంటి కళంక మేర్పడుతుందో అని భయపడుతున్నాను. ఇప్పుడు మన కర్తవ్యమేదో ఆలోచించండి” అని తమ్ముల నడిగాడు.

“తరంగములపై బడిన తైలంవలె ఈ అపకీర్తి ఒకరినుంచి ఒకరికి వ్యాపిస్తుంది. గజేంద్రం - బంధనస్తంభంపై ఎంత అసహనం ప్రదర్శిస్తుందో ! అంతగా నా హృదయం క్షోభిస్తోంది. స్వేచ్ఛగా ఎలా విహరించగలనో చెప్పండి.....”

“ఇలా ఏర్పడిన అపవాదును తొలగించుకోడానికి, సంతానవతి కాబోతున్న వైదేహిని పరిత్యజించడమే మార్గమా?..... గతంలో తండ్రి యాజ్ఞ మేరకు రాజ్యాన్ని పరిత్యజించానే! అలా చేయడమే తప్ప అన్యథా కర్తవ్యం కన్పించడంలేదు” అన్నాడు. చింతాక్రాంతుడై రాముడు క్షోభించాడు. వ్యక్తి ఇష్టానిష్టాల కన్నా లోకాపవాదమే బలవత్తరం కదా! సత్యేతరమే అయినా, మూఢలోక ప్రవాదమే క్రమంగా రూఢమైపోతుంది. భూమిచ్ఛాయ చంద్రునిపై బడి కళంకంగా స్థిరపడలేదా! కనక దిగువ ప్రజల వాణిని పాటించక తప్పదు” అన్నాడు రాముడు తన నిశ్చయాన్ని తెల్పుతూ.

(మహాకవి కాళిదాసు ఎంత ఖగోళశాస్త్రజ్ఞుడో, ‘ఛాయాహిభూమే: శశినోమల త్వే నారోపితా శుద్ధిమతః” అన్న ఉపమానం మనకు బోధపడ్తుంది. చంద్రునిలో కనిపించే మచ్చ భూమినీడేనని ఆనాటి ఖగోళశాస్త్రజ్ఞులు విశ్వసించి వుండటం కాళిదాసుకు ఉపమా సామాగ్రిగా ఉపయుక్తమైంది)

“ఎంతో ప్రయాస చెంది, రావణుని సంహరించడంతో ఆ అపకీర్తి తొలగుతుందనుకున్నాను. ఆ వైరమే ఈ అపకీర్తి రూపంగా నన్ను వెంటాడుతోంది. దానిని సమూలంగా నశింపచేయడ మెలాగ? కాలితో త్రొక్కితే, సర్పం మనిషి రక్తం త్రాగడానికి కాటువేస్తుందా? తన అవమానం సహించజాలకనే కాటువేస్తుంది. అలాగే నాకిప్పుడేర్పడిన క్లేశం రావణాపకార ఫలస్ఫూర్తి నశించేదాకా వుండేదే. అది సీతా పరిత్యాగంతో తప్ప తీరదు . . . . .” అంటూ రాముడు ఖేదంతో కుమిలిపోయాడు.

అంతలో తేరుకున్నాడు. “నాప్రియమైన తమ్ములారా! ఈ కారణాలు నన్ను వేధించగా సీతాపరిత్యాగమే అవశ్యకర్తవ్యమని నిశ్చయించుకున్నాను. ఈ అపనిందబాపుకొని మరికొంతకాలం జీవించాలని కోరుతున్నాను. మీరు నా కోరికను తప్పక ఆమోదించాలి. ఇదే నా ఆకాంక్ష! కాన నాపై దయతో నన్ను వారించవద్దని అర్థిస్తున్నాను” అన్నాడు.

తనపతి కల్పవృక్షం వంటివాడు. తాను కోరిన కోరికలు అనతికాలంలో తీర్చగల సహృదయుడు. కాని ప్రస్తుతం అతని హృదయం విషవృక్షంగా మారిందన్న సత్యాన్ని ఆకోమలి

గ్రహించలేకపోయింది. (ఇక్కడ మహాకవి 'నాబుద్ధాకల్పద్రుమతాంలిహాయి' అని హృద్యంగా చెప్పాడు. దానితోపాటు అసిపత్రవృక్ష అనీ అన్నాడు. ఖడ్గములవంటి ఆకులుగల వృక్షంగా మారాడని ఆమె తలచలేకపోయింది అని భావం)

లక్ష్మణుడు-తన గుండెను నలిపేస్తున్న దుఃఖాన్ని అణచుకోలేకపోతున్నాడు. మాటిమాటికీ సీతకుడికన్ను అదురుతూ ఏదో కీడు రాకసూచిస్తోంది. "ఏమిటీ కుడికన్ను ఎందుకిలా అదురుతోందో" అని ఆమె మనసులో శంకిస్తోంది. అదుశ్శకునానికి ఆమె హృదయం తల్లడిల్లింది. ఆ మానసిక భీతి ఆమె ముఖారవిందాన్ని మ్లానమొనంది. కాని వెంటనే ఆమె మనసులో రామునికీ అతని తమ్ములకూ సకల శుభాలూ కలుగుగాక అని ఆకాంక్షించింది. తన నిర్మల హృదయాశంసలందించింది. . . .

రథం - గంగానదీతీర భూముల సమీపించింది. చింతామతి లక్ష్మణుడు యథాలాపంగా దూరాన కనిపించే గంగాతరంగాలను చూస్తున్నాడు. రథందిగి గంగానదిని సముత్తరించాలి. గంగాతరంగాలతనికి అకార్యం చేయకుసుమీ అని వారిస్తూ ఉపదేశిస్తున్నట్లు అతని మనసుకు స్ఫురించింది. గంగాతీరంలో రథాన్ని సుమంత్రుడాపుచేశాడు. సీతాదేవిని మెత్తని ఇసుకతటంపై దింపాడు. బోయతెచ్చిన మంచిపడవపైకి ఎక్కించాడు. ఆమెను భాగీరథిని దాటించాడు. ఒక సత్యసంధుడు తనమాట చెల్లించుకున్నట్లయింది. తనకిష్టం లేకపోయినా, అన్నగారి ఆజ్ఞ పాలించకతప్పలేదు. దానివల్ల మానసికంగా నలిగిపోతున్నాడు.

గంగను దాటి అద్దరికి వెళ్ళారన్న మాటేగానీ లక్ష్మణుడొక అఖాతంలో మునిగిపోతున్నాడు. అతని హృదయం బాధతో గిజగిజలాడుతోంది. అచేతనత్వమేదో అనుభవిస్తున్నాడు. ఆమెకిప్పుడు యథార్థం చెప్పక తప్పదు. ఎలా చెప్పడం? అవాచ్యమైన సంగతి చెప్పడానికి మాటలెలా వస్తాయి? తీవ్రబాధాకందళితుడౌతున్నాడు లక్ష్మణుడు. కన్నీరు జలజలా ప్రవహిస్తోంది. కంఠం రుద్ధమై పూడుకుపోతున్నది. ప్రళయకాలమేఘం రాళ్ళవాన కురిపిస్తున్నట్లుగా తన హృదయాన్ని వెల్లడించాడు. (ఇక్కడ మహాకవి రాముని గూర్చి లక్ష్మణునినోట అగ్రజుని ఆజ్ఞ అనిపించలేదు. ఆ ఆజ్ఞకూ తన హృదయానికీ ఉన్న దూరాన్ని ధ్వనింపజేస్తూ "మహీపతేః శాసనముజ్జగారః" అన్నాడు)

లక్ష్మణుని సత్యవాక్కులు రాళ్ళదెబ్బలై తన తలను మోదాయి. పెద్ద గాలివానకు పూవులన్నీ రాల్చి తన పట్టులన్నీ జారి నేలపై కూలిన లతవలె సీతాదేవి ఆ అవమానాగ్నికి తపించింది. తన తల్లి-భూదేవిని కౌగలించుకొని బావురుమని ఏడ్చింది. సీతను పరిత్యజించడానికి గల కారణమేమో తెలియనిభూదేవి మహత్తర ఇక్ష్వాకువంశంలో పుట్టిన రాముడు నిన్ను పరిత్యజించడమేమిటి? అన్న సందేహంతో ఆమెకు ప్రవేశం కలిగించలేదు. మూర్ఛాగతమై సీత అలాగే పడివుంది. భూమాతకు కారణమేమిటో తెలియలేదు. కాని, సీతాదేహస్పర్శవల్ల ఆమె మనసు మాత్రం క్షోభించింది. లక్ష్మణుడామె ముఖంపై శీతలోదకం చల్లాడు. సేదతేర్చాడు. కాని ఆమె ముఖం అవమానాగ్నికి వసివాడి బాధగా వుంది.

ఏ పాపమూ ఎరుగని తనకెందుకీ శిక్ష? రాముడేలనిర్దయగా ఇలా చేశాడు? తాను నిష్కళంక. ఆసత్యాన్ని భర్తగా రాముడెరుగడా? ఈ జన్మలో చేయని ఏపాపంవల్ల తనకీ దారుణశిక్ష లభించింది? అని తలపోస్తూ వెక్కివెక్కి ఏడ్చింది.

"అమ్మా! మీరు చెప్పిన ప్రతిమాటా అన్నగారితో విన్నవిస్తాను. నాకింక సెలవిప్పించండి" అన్నాడు. లక్ష్మణుడు నదిదాటాడు. రథమెక్కాడు గృహోన్ముఖుడై సాగిపోతున్నాడు.

సీతాసాధ్వి కనుచూపుమేరవరకు అతనిపోకడ చూస్తోంది. భిత్తిచిత్రంవలె చైతన్యరహితంగా నిలచివుంది. లక్ష్మణుని రథఛాయలేమాత్రం దృగ్గోచరం కావడంలేదు. ఇంక తనకెవరూ దిక్కులేరా? ఈవనాంతరంలో ఏకాంతంగానే బ్రతకవలసివుందా? ఎలా బ్రతకాలి? ఆలోచనలు సుళ్ళుతిరిగాయి. ఒక్కసారిగా పెద్దపెట్టున కంఠధ్వని యావత్తూ కట్టుతెంపుకు బయటపడగా రోదించనారంభించింది. తన నాగరికతా సౌకుమార్యాలన్నీ ఏమైపోయాయో? ఆటవిక భీతాహంగా పెల్లుబుకుతూ ఏడుస్తోంది.

ఆమె రోదనోద్గార కంఠధ్వానానికి అరణ్యం ప్రతిధ్వనించింది. అడవి స్తంభించింది. నెమళ్ళు నాట్యం ఆపుచేశాయి. జాలిగా చూస్తున్నాయి. వృక్షాలు బాష్పబిందువులవలె పుష్పాలు రాలుస్తున్నాయి. హరిణాలు నోటకరచిన దర్భలను నమలడం మాని కరుణామయ దృక్కులు బరుపుతున్నాయి. మొత్తం కాననమంతా సీతాదుఃఖ సమభావాన్ని అనుభవిస్తోంది.

సరిగ్గా అదే సమయంలో వాల్మీకి మహర్షి తనకు కావలసిన దర్భలూ సమిధలూ సేకరించుకుందుకు అడవిలో తిరుగుతున్నాడు. ఎప్పుడూ ఎరుగని రీతిగా శోకాకులిత స్త్రీ, కంఠధ్వని వినవస్తున్నదేమా అని సంశయిస్తూ పస్తాయించాడు. ఆరోదన వచ్చినదిశగా వెదుకుతూ నడువనారంభించాడు. దయాంతరంగుడైన ఆముని స్త్రీశోకం విని ఆగలేకపోవడంలో ఆశ్చర్యంలేదు. అలనాడు నిషాదుడు క్రౌంచమిథునంలో పెనిమిటిని క్రూరశరంతో కూలవేసినపుడు శోకాన్ని శ్లోకంగా మార్చి కూర్చిన వాడాయన!

ఆముని తన మ్రోలకు రావడం చూచిన సీత మరింతగా దుఃఖంపెల్లుబికి రోదించ నారంభించింది. మెల్లగా దుఃఖాన్ని సంబాళించుకొని కనులు తుడుచుకొంటూ ఆయన్ని చూస్తున్నది. ఆమె చూపులకు బాష్పవారి తెరలు వ్రేలుస్తున్నది. తన పైటచెంగుతో మెత్తగా అద్దుకున్నది. ఆయన సమీపించగానే నమస్కరించింది. ఆమె గర్భవతి అన్న విషయం గ్రహించాడు వాల్మీకి. ఆమెను సుపుత్రాప్రాప్తిరస్తు అని వెంటనే దీవించాడు. దివ్యదర్శనంతో ఆయన మనస్సులో స్పష్టం కాజొచ్చింది. రఘువంశద్యుమణి, శ్రీరామునిభార్య సీతగా గ్రహించాడు. కేవలం నికృష్టమానవుడెవరో ప్రచారం చేసిన అపవాదుకు భయపడి రాముడు ధర్మపత్నిని అరణ్యంలో విడిచి పెట్టాడన్న యథార్థమూ గ్రహించగలిగాడు. ఆమెతో ఇలా సాదరంగా అన్నాడు.

"ఓ వైదేహీ! దుఃఖించకమ్మా! స్థలాంతర మందున్న నీతండ్రి ఇంటికే నీవువచ్చావు. నాఆశ్రమం నీకు పుట్టిల్లుతో సమానమేనమ్మా! నీకు మరేమీ భయంలేదు" అంటూ

చల్లనిమాటలతో ఓదార్చాడు.

'సీతా! ముల్లోకాలకీ కంటకప్రాయుడైన రావణుని వధించి లోకోపకారం చేశాడు నీభర్త! ఆయన సత్యసంధుడు' ఆత్మస్తుతి విదూరుడు, సౌజన్యమూర్తి. సర్వులకూ స్నేహపాత్రుడు. కానీ నీ విషయంలో మాత్రం కలుషవర్తనం ప్రదర్శించాడు. తన సర్వసద్గుణములనూ తానుగా పోగొట్టుకున్నాడు. భరతాగ్రజుడంటే నాకు విపరీతమైన కోపం కలుగుతోంది సుమా!" అన్నాడు.

తమ్ముని పేరుతో అతన్ని నిర్దేశించడంలో అతని పేరైనా ఉచ్చరించనిష్టపడనంత కలుషాత్ముడయ్యాడని వాల్మీకి ధ్వనింపజేశాడు. ఆయన ఇంకా ఇలా అంటున్నాడు. నీమామ దశరథుడు నాకు మిత్రుడు. బ్రహ్మజ్ఞాన పరాయణుడు నీతండ్రి. నాకు పూజనీయుడు. నీవా-పతివ్రతా శిరోమణివి. అట్టి నిన్ను కేవలం కుమార్తెగా ఆశ్రమంలో రక్షించుకోవడం నావిధి. నీవు నాకు నిరంతరం ఆదరణ పాత్రురాలివే. సంశయించకు. మునుల సహవాసంవల్ల ఇక్కడ జంతువులు సహజక్రౌర్యం విడిచి స్నేహంగా బ్రతుకుతున్నాయి. నీవిక్కడ సుఖసంతోషాలతో గడపగలుగుతావు. నీకు సుఖప్రసవమైన పిదప నీసంతానానికి జాతక కర్మాదిక అనుష్ఠానాలిక్కడే జరుగుతాయి. ఈ తమసానదిని చూశావా? ఉభయతీరస్థ భూములలోనూ మునిగణాల ఆశ్రమాలతో మంత్రోచ్చాటనలతో ఎంతోపవిత్ర తరంగనాదాలు కలిగిస్తోంది. ఈ నదీతీరంలో స్నానంచేసి, ఈ తీరంలోని ఇసుకతిన్నెలపై ఇష్టదేవతాప్రార్థన చేసుకుంటే నీమనసు నిర్మలమౌతుంది. నీహృదయగత శోకం చల్లారుతుంది.

"వనాంతరమండలి సురభిళోపేత పుష్పస్తబకాలను, మధురరస పుష్కలమైన ఫలములను నీవారధాన్యాదులను నీకు నిత్యం అందించి, చక్కని స్నేహహృదయంతో నీ చెలిమిలో ప్రొద్దుపుచ్చే మునికన్యలెందరో నీకు నిత్యం స్నేహితులై మెలగుతారు. నీకు నిరంతరానందం కలిగిస్తారు. నీ హృదయ క్లేశం తొలగిస్తారు. నీశక్తిమేరకు చిన్న చిన్నకడవలతో నీరునింపి ఈ ఫలవృక్షాలు, పూలమొక్కలకు జలహారమందిస్తూ, మాతృభావాన్ని పెంపుచేసుకుందువుగాని!" అంటూ మహర్షి ఎంతో ప్రేమతో సీతనాదరించాడు.

ఆయన అందించిన ప్రేమాదరాలకెంతో సాంత్వనం పొందింది సీత. కృతజ్ఞతాపూర్ణ హృదయంతో ఆమహర్షి పాదాలకు నమస్కరించింది. ఆవిధంగా తన అంగీకారం తెలిపింది. వాల్మీకి ఆశ్రమాభిముఖంగా ముందు నడుస్తున్నాడు. ఆ సాయంత్రసమయంలో సీత మహర్షిని అనుసరించింది. శాంతిమయమైన ఆశ్రమం చేరుకుంది. తనకూడా అనుసరించి వచ్చిన శోకమూర్తిని ఆయన తన పరివారానికి పరిచయం చేశాడు. మునిపత్నులకు అప్పగించాడు. సీతకు ఆతిథ్యాదులు నెరవేర్చమని ఆజ్ఞాపించాడు. ఆమె చుట్టూ మునిపత్నులు, కన్యలు సాదరంగా చేరారు. ఆమె సౌందర్యాన్ని చూస్తూ మురిసిపోయారు. ఆమె శోకాగ్నిజ్వలితగా కుములుతున్న సంగతి కనిపెట్టారు. ఎంతో ఆత్మీయంగా అనునయిస్తూ ఆదరించారు. ఆమెనొక ఆశ్రమ వాటికకు తీసుకుపోయారు. పరిశుద్ధమైన కృష్ణాజినం పక్కగా పరిచారు. అదే ఆమెకు నివాసమని తెలిపారు. ఆమె సుఖంగా స్నానం చేసి వచ్చింది. మునిపత్నులిచ్చిన నారచీర

ధరించింది. ఫలహారాదులు స్వీకరించింది. తాపసవృత్తి నవలంబించిన పవిత్రురాలై భాసించింది. భర్త సంతానాన్ని ఆమె గర్భంలో ధరించి వున్నందున సముచితాహారం స్వీకరిస్తూ శరీరపోషణ కావించుకోవలసివుంది.

లక్ష్మణుడు అయోధ్య చేరుకున్నాడు. గృహాంతరమందు రాముడు ఖిన్నవదనంతో కూర్చుని వున్నాడు. లోకోపకార భీతుడై హృదయ కాఠిన్య మవలంబించాడు. సీతను అడవులలో పరిత్యజింపచేశాడు. అతని హృదయం పశ్చాత్తాప దుఃఖంతో కుమిలిపోతోంది. లక్ష్మణుడు అన్నను సమీపించాడు. తాను సీతను రథారూఢగా గంగాతీరానికి చేరడం - పడవలో అవతలి తీరానికి చేరడం, వాల్మీకి ఆశ్రమ సమీపంలో దిగబెట్టిన వృత్తాంతమంతా విశదపరచాడు. ఆమె విపరీత దుఃఖంతో చెప్పమన్న మాటలను సవివరంగా అన్నకు నివేదించాడు. అలా చెబుతున్నపుడు లక్ష్మణుని పరాక్రమం పొంగుకురావడం రాముడు గ్రహించాడు. అయినా రాజాజ్ఞవల్ల అతనెలా సంయమనంతో శాంతచిత్తుడై, ఆ దుఃఖగాథనెలా వివరిస్తున్నదీ రాముడు తెలుసుకుని దుఃఖించాడు.

సీతా పరిత్యాగ గాథను లక్ష్మణుడు వివరించగానే రాముని ముఖం తుషార వర్షావృత పుష్యమాస చంద్రబింబం వలె, మ్లానమైపోయింది. లోకాపవాద భీతితో సీతను పరిత్యజించ గలిగాడేగాని - నిత్యానురక్తుడైన అతని హృదయంనుంచి ఆమె వైదొలగలేదు. అందువల్లనే తమ్ముని మ్రోల విపరీత దుఃఖాకులిత మనస్కుడై అశ్రుధారా ప్రపూర్ణుడయ్యాడు రామచంద్రుడు.

రాజోచిత భోగాలన్నీ విసర్జించాడు. అయోధ్యారాజ్యం సర్వసమృద్ధమై ప్రజలందరికీ సుఖశాంతు లొనగూడుతున్నాయి. ఉన్న ఒక్క భార్యనూ విడిచిపెట్టిన రాముడు రాజ్యలక్ష్మీ కింకరుడై కాలం వెళ్ళబుచ్చుతున్నాడు.

ఇక్కడ కాళిదాస మహాకవి - సాధారణంగా రాస్తున్న అనుష్టప్ శ్లోకబంధాన్ని విడిచి, ఈ సర్గను ముగిస్తున్న సందర్భంలో శార్దూలవిక్రీడం రచించాడు.

అయోధ్యలో తన భర్త వియోగ దుఃఖంలో దురపిల్లుతూంటాడనీ, రాజులకు సాధారణమైన ఉపపత్నీ సమాదరణ మెంతమాత్రం స్వీకరించలేదనీ, తన రూపంతో కాంచన విగ్రహాన్ని చేయించి, ఆ విగ్రహ సాన్నిహిత్యంలోనే యజ్ఞకార్యభారాలు నిర్వర్తిస్తున్నాడనీ, సీతకు వార్తలందుతున్నాయి! ఆమెకు సంభవించిన పరిత్యక్త దుఃఖభారాన్నీ - వాల్మీకి ఆశ్రమవాస వాతావరణ ఆదరణవల్ల మరచిపోగలుగుతోంది. దుర్వార పరిత్యాగ దుఃఖాన్ని శమించ గలుగుతోంది.

## పంచమదశ సర్గ

రాముడు సీతా పరిత్యాగంతో ఏకాకి అయిపోయాడు. వందలాదిగా పరివారం ఉన్న రాజప్రాసాదంలో ఒంటరి వాడైపోయాడు. రాజ్యపాలనా బాధ్యతలు తప్ప మరే సరస సల్లాపాలూ లేవు. కేవల సీతా చింతన తప్ప మరే ధ్యాసా లేదు.

యమునా తీరవాసులైన మునిగణం అతన్ని దర్శించుకొని, మొరపెట్టుకొన్నారు. లవణాసురుడు తమ యజ్ఞయాగాలను ధ్వంసం చేస్తున్నాడనీ, నిత్యం హింసిస్తున్నాడనీ, వాడి బారి నుంచి రక్షించమనీ, విన్నవించుకున్నారు. మునులు కనుక వానిని శాపదగ్ధుని చేయవచ్చు. కానీ, శాపంవల్ల తమ తపఃఫలం వ్యయమైపోతుంది.

రాముడు వెంటనే వారికి అభయమిచ్చాడు. "ధర్మరక్షణమే నా బాధ్యత. రాజుగా నా ధర్మం అదే. తప్పక లవణాసురుని చంపి, మీరు నిర్విఘ్నంగా యజ్ఞాలు చేసుకునే అవకాశం కల్పిస్తాను" అని వారికి ప్రతిజ్ఞ చేశాడు.

ఆ మునివరులిలా వివరించారు. "వాడు కనుక శూలధారి అయితే మాత్రం అజేయుడే. కనుక శూలమును పట్టుకోక ముందే అతన్ని వధించవలసి వుంది" అని, అతని మరణ రహస్య మందించారు.

రాముడు శత్రుఘ్నుని కబురుచేశాడు. "సముచిత సైన్యంతో యమునా నదీప్రాంత ఋష్యాశ్రమానికి వెళ్ళి ఆమునులకు రక్షణ కల్పించు" అని ఆజ్ఞాపించాడు. శత్రువులను జయించే ప్రతాపంగల తమ్ముడు సార్థకనాముడే. ఆకార్యానికి తగినవాడే. అన్నగారి ఆశీస్సులందుకున్నాడు. లవణాసురిని ఆకృత్యంవల్ల నిత్యబాధితులైన మునులు ముందునడుస్తూ దారి చూపుతున్నారు. రథారూఢుడై శత్రుఘ్నుడు పురోగమిస్తున్నాడు. సముచిత సంఖ్యాబలంతో సాయుధులైన సైనికులు వెనుకగా అనుసరిస్తున్నారు.

(ఈ సందర్భంలో కాళిదాసు చెప్పిన శ్లోకం సుందరమైనది. "అగ్రజేన ప్రయుక్తాశీ స్తతో దాశరథీ-రథీ-యమోవనస్థలీః పశ్యన్ పుష్పితాః సురభీరభీః" అంటూ చేతానుప్రాస అనే శబ్దాలంకారంతో హృద్యమైన శ్లోకం రచించాడు) దారిపొడుగునా గల వనస్థలాలు పుష్పిత ద్రుమాలతో సురభిళాలు వెదజల్లుతున్నాయి. దృశ్యమూ సమయమూ మనోజ్ఞంగా ఉన్నాయి. అతని మానసికోల్లాసం నిర్భీతిగా ఉత్సహిస్తోంది. రాముని ఆదేశానుసారం శత్రుఘ్నుడు పరిసరాలను వీక్షిస్తూ సాగుతున్నాడు. అతని రథం ముందు నడుస్తున్న మునిగణం సూర్యుని రథం ముందు నడిచే వాలఖిల్యులవలె ఉన్నారు. ప్రయాణ మధ్యంలో రాత్రి అయింది. అందరినీ విశ్రాంతి తీసుకోమని చెప్పి, శత్రుఘ్నుడు సమీప మందున్న వాల్మీకి ఋష్యాశ్రమానికి వెళ్ళాడు. ఆ ముని అతనికి అతిథి మర్యాదలొనర్చాడు. సముచిత భోజన భాజనాదులందించాడు. ఆరాత్రికి వాల్మీకి ఆశ్రమంలో విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో సీతామహాదేవి అక్కడే ఉన్నదని, ప్రసవ సమయమనీ తెలుసుకున్నాడు. ఆరాత్రి సీతకు ప్రసవమైంది. కవల పిల్లలుగా కుమారులవతరించారు. భూరాజ్యానికి ప్రసాదింపబడిన కోశదండాలవలె ఉన్నారు. రఘువంశ దీపకు లుద్భవించారు.

ఈవార్తవిని శత్రుఘ్నుడు సంతోష భరితుడయ్యాడు. ఆరాత్రికి అక్కడే గడిపి, తెల్లవారగానే వాల్మీకిముని ఆశీస్సులు పొంది, కర్తవ్యపాలనా దీక్షతో ప్రయాణమయ్యాడు. సుమిత్రా నందనుడు లవణాసురుని రాజధాని - మధుపట్నం చేరుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో తనకాహారం నిమిత్తం అరణ్యం నుంచి అసంఖ్యాక జంతువులను తోలుకొని వస్తున్నాడు. ఎదురయ్యాడు ఈ రాక్షసుడు - రావణాదుల చెల్లెలు - కుంభీనసి కుమారుడు. మేనమామలగు రావణకుంభ

కర్ణాదులను పోలివున్నాడు.

ఆ రాక్షసుడు సమీపిస్తున్న కొద్దీ దుర్వాసన దుర్భరమౌతోంది. పొగచూరినట్లు శరీరం నల్లగా మాడివుంది. దానిమీద ఎర్రరంగు పులిమినట్లు కనిపిస్తోంది. మంట శిఖల ఆకృతిలో చిందర వందరగా గాలిలోకి వస్తున్న పసుపురంగు వెంట్రుకలు - వాడు ముందుకు వస్తుంటే, వెనుకతట్టుగా గ్రద్దలు గగనవీధిలో అరుస్తూ అనుసరిస్తున్నాయి. అవే - వాడి పరివారమా అన్నట్లున్నాయి. వాడు నడుస్తున్న చితిలాగ కనిపిస్తున్నాడు.

వాడిని చూడగానే శత్రుఘ్నుడు అసహ్యంతో ముక్కుమూసుకున్నాడు. బయలుదేరుతున్న సమయంలో తనకు మునులు చెప్పిన వాడి మరణ రహస్యం జ్ఞాపకం వచ్చింది. లవణాసురుని చేతిలో శూలం లేదు కనుక వాడి బ్రతుకులోకి మరణం ప్రవేశించే రంధ్రాన్ని వాడే ఏర్పరచుకున్నాడు. వెంటనే వాడిమీదికి రథం ఉరికించి శత్రుఘ్నుడు శరసముదాయంతో వాడి శరీరాన్ని చీల్చనారంభించాడు.

"ఓరీ నీచుడా! నాపైనే బాణాలు వేస్తున్నావా? నీకెంత ధైర్యంరా! నా ఆకలి తీర్చడాని కీనాడు తగినన్ని జంతువులు లభ్యంకాక పోవడంవల్ల నిన్ను యముడు నా ఆహారంగా పంపినట్లున్నదిరా!" అంటూ గర్జిస్తూ వాడొక చెట్టును గడ్డిపరకను పీకినట్లు పీకి అతనిపైకి విసిరాడు.

సుమిత్రానందనుడు నిశిత బాణ సంచయనం ఎక్కుపెడుతున్నాడు. వాడు విసరిన చెట్టు దారిలోనే అతని బాణాలకు తుత్తునియలుగా కూలిపోయింది. ఆ చెట్టు నిండా ఉన్న పూలు - పుప్పొడులను శత్రుఘ్నుని వీరశరీరాన్ని అలదుతున్నాయి. గాలిలోనే చెట్టు ముక్కలుగా కూలడం పెద్ద అవమానంగా భావించాడు లవణాసురుడు. వెంటనే ఒక పెద్ద రాతి బండను పెకలించి శత్రుఘ్నుని పైకి విసిరాడు. వెంటనే అతను ఇంద్రదేవతాంక అనే అస్త్రాన్ని ప్రయోగించాడు. వజ్రాయుధ సన్నిభమైన ఆ అస్త్రం ఆ బండరాయిని ఢీకొని, ఇసుకరేణువుల వంటి చూర్ణం చేసింది. ఆ దృశ్యంచూచి విపరీత కోపంతో తన దక్షిణ బాహువు నెత్తాడు. తాడిచెట్లతో వున్న ఒక కొండను పెకలించాడు. దానిని శత్రుఘ్నునిపై ప్రయోగించ పూనుకున్నాడు. చేతిలోని పర్వతంతో విజృంభిస్తూ వస్తున్న వాడిపైకి శత్రుఘ్నుడు వైష్ణవాస్త్రం ప్రయోగించాడు. అది నిర్నిరోధక నారాయణాస్త్రమే! అది వాడి వక్షాన్ని చీల్చనారంభించింది. వాడి ప్రాణధాతువులను హరింపనారంభించింది. దాంతో లవణాసురుడు తన దేహ భారాన్ని ఒక్క పెట్టున భూమిపై విసిరేశాడు. ఆ భారంతో భూమి కంపించింది. వాడి దుష్ట విపత్తు తొలగడంతో మునులు హర్షపులకిత దేహులయ్యారు. వీడి మరణంతో రాక్షస నాశనం పూర్తికావడంతో దేవతలు పుష్పవర్షం కురిపించారు. లవణాసురుని శరీరంపై కాకులు, గ్రద్దలు వాలనారంభించాయి.

నేడు లవణాసురుని చంపిన శత్రుఘ్నుడు అలనాడు ఇంద్రజిత్తుని చంపిన తన అన్న లక్ష్మణుని కీర్తిని నిలబెడుతూ అనుసరించడం మోదోత్సవంగా ఉంది. లవణాసురుని వధ అనే మహత్కార్యం సిద్ధించినందుకు మునులు స్తుతించ నారంభించారు. శత్రుఘ్నునకు చిరుసిగ్గులు ఆవహిస్తూండగా తలవాల్చి చిరునవ్వులు నవ్వుతూ నిలచి ఉన్నాడు.

తన ఈ విజయ సంకేతంగా యమునా నదీతీరాన మధురానగరం అనే రాజధాని నిర్మించాడు. రాజుగా పట్టాభిషేకం జరుపుకున్నాడు. ఉత్తమ గుణసంపన్నుడైన రఘుకులాన్వయుని రాజుగా పొందగలిగినందుకు ప్రజలంతా ఆనందించారు. మునులు జీవన భద్రతను పొందారు.

సకలైశ్వర్యాలూ పొంది ప్రజలంతా సుఖజీవనం అనుభవిస్తున్నారు. తన రాజధాని మధురానగరిలో మేడపై నిలచి శత్రుఘ్నుడు ప్రకృతి సౌందర్యం తిలకిస్తూ ఆనందిస్తున్నాడు. యమునానదీ తరంగాలపై చక్రవాకాలు విహరిస్తూ, పరిసర భూమిని సువర్ణాభరణాలతో అలంకరించినట్లున్నాయి. ఆ సౌందర్యాన్ని చూస్తూ అతడానందిస్తున్నాడు.

ఆశ్రమంలో సీతా కుమారులకు జాతక కర్మాదులు పూర్తిచేశాడు వాల్మీకి ముని. మైథిలీ పుత్రులు, మహర్షి ఆశీస్సులతో చక్కగా పెరుగుతున్నారు. ఇక్కడ కాళిదాసు - దశరథ మహారాజు పౌత్రులనీ, జనక మహారాజు దౌహిత్రులనీ వ్యవహరించాడే తప్ప రాముని పేర్కొనలేదు. దారా పరిత్యాగం చేసిన అతనిపట్ల కోపం ఇంకా తగ్గలేదని ధ్వనింపచేయడమే మహాకవి ఉద్దేశం. దర్భ చిగుళ్ళతో అభిషేకం చేసినందున పెద్దవానిని 'కుశుడ'నీ, గోపుచ్ఛంతో అభిషేకం చేసినందున చిన్నవానికి 'లవుడ'నీ వాల్మీకి పేర్లు పెట్టాడు. ఆ పేరులతోనే వారు శాశ్వతంగా వ్యవహరించబడవలసిందిగా ఆశీర్వదించాడు.

ఆ బాలురకు కొద్దిగా శైశవం గడచిన వెంటనే వేదం బోధించనారంభించాడు. సర్వధర్మాలకూ ఆకరమై ఉన్న తాను రచించిన రామాయణ కావ్యం గానం చేయు పద్ధతిలో బాలురకు నేర్పనారంభించాడు. ఆ కుమారులిరువురూ తాము నేర్చుకున్నంత వరకూ శ్రీరాముని చరిత్రను తల్లి ఎదుట గానం చేస్తూ వినిపించేవారు. ఆ మధుర కంఠాల గానం వింటూ రామ వియోగ దుఃఖాన్ని అనునయింప చేసుకుంటూ ఉంది సీత.

వాల్మీకి ఆశ్రమంలో ఇలా సాగుతూండగా మధురానగరిలో శత్రుఘ్నుడు కూడా ఇరువురు కుమారులను కన్నాడు. అయోధ్యలో భరత లక్ష్మణులు కూడా పతివ్రతలైన తమ భార్యల యందు ఇద్దరేసి కుమారులను పొందారు. మధురానగర నిర్మాణానంతరం శత్రుఘ్నుడు కొంతకాలముండి తన అగ్రజుని సన్నిధిలో గడపాలన్న కోరికతో తన కుమారులైన బహుసిత, సుబాహువులకు మధురానగర, విధిసానగర పాలనా బాధ్యతలు అప్పగించాడు. తాను అయోధ్యా నగరానికి వెళ్ళాడు.

వాల్మీకి ఆశ్రమంలో కుశలవులు రామాయణ గానం హృద్యంగా చేస్తున్నారు. ఆశ్రమవాసులెంతో ఉత్సాహంగా వింటున్నారు. లేళ్ళు సైతం మేత మాని శ్రద్ధగా వింటున్నవి.

అయోధ్యకు తిరుగు ప్రయాణం చేస్తున్నపుడు శత్రుఘ్నుడు మళ్ళీ దారిలో ఉన్న వాల్మీకి ఆశ్రమానికి వెళ్ళలేదు. అక్కడి ప్రశాంతిని భంగపరచవలసి వస్తుందని అతను తలచాడు. నేరుగా అయోధ్యకే వెళ్ళిపోయాడు. మహా క్రూరుడైన లవణాసురుని చంపి, బాధలనుంచి తమను విముక్త మొనరించినందుకు దారిపొడుగునా ప్రజలు కృతజ్ఞతతో గౌరవిస్తున్నారు. ఆయన రాజధానికి చేరేసరికి అయోధ్యా నగరాన్ని ప్రజలు అలంకరించారు. ముఖ్యమైన రాజమార్గాలన్నీ శుభ్రపరిచారు.

శత్రుఘ్నుడు అన్నను చూడగానే భక్తి ప్రపత్తులతో నమస్కరించాడు. అన్న దగ్గర కూర్చుని తాను సాధించిన విజయాలు గురించిన సంగతులన్నీ వివరించాడు. కానీ తాను మార్గమధ్యంలో వాల్మీకి ఆశ్రమంలో విశ్రాంతి తీసుకున్న విషయంగాని, సీతా ప్రసవమైన సంగతిగానీ చెప్పలేదు.

రాముడు యథాపూర్వకంగా రాజ్యపాలన సాగిస్తున్నాడు. పూర్వ మొకపుడు కాలనేమి అనే బహుక్రూరుడైన రక్కసిని మహేంద్రుని పంపున ఉపేంద్రుడు చంపినపుడు ఇంద్రుడెంతగా ఆనందించాడో, ఇపుడు రాముడు సైతం అంత ఆప్యాయంగా తమ్ముని మెచ్చుకున్నాడు. ఒక్కొక్క విషయం గురించీ ప్రశ్నించి, శత్రుఘ్ని ద్వారా సకల విషయాలూ గ్రహిస్తున్నాడు రాముడు.

ఆనాడు వాల్మీకి ఆశ్రమంలో విశ్రాంతి తీసుకుని మరునాటి వేకువతో ఆ మహర్షి ఆశీస్సులు పొందిన సమయంలో "నాయనా, నీవీ వార్తను రాముని కెరిగించకు. తగిన సమయం చూచి నేనే స్వయంగా తెలుపగలను" అని ఆజ్ఞాపించడం వల్ల ఆ విషయం మాత్రం అన్నగారికి చెప్పలేదు.

కొన్నాళ్ళు గడిచాయి. ఒకనాడు రాజప్రాసాద ద్వారంకడ ఒక విప్రుడు భోరుభోరున విలపించసాగాడు. అదేమిటని విచారించాడు. తన తొడపై తలనిడుకొని మృతకుమారుని పడుకోబెట్టుకుని ఏడుస్తున్న బ్రాహ్మణుని సమీపించి, "కాస్సేపు దుఃఖం ఆపి - విషయ విశదం చేయ"మని రాముడు కోరాడు.

"రామా! నీ పరిపాలనలో ఈ భూమి మిక్కిలి హీనదశకు చేరింది. ఎంతో శోచనీయ అరిష్టములు జరుగుతున్నాయి. వృద్ధుడనైన నన్ను విడచి, యౌవన దశకు చేరుకున్న నా కుమారుని మృత్యువు మ్రింగివేయడం అస్తవ్యస్తం కాదా? ఎంత అన్యాయం జరిగిందో చూశావా?" అంటూ మొరబెట్టుకున్నాడు.

రాముడాశ్చర్య చకితుడయ్యాడు. సిగ్గుతో తల ఒంచుకున్నాడు. ఆ బ్రాహ్మణ్ణి ఓదార్చాడు. క్షణకాలం ఓర్చుకోమని అర్థించాడు. "నేను యమధర్మరాజునైనా జయించి, నీ కుమారుని బ్రతికిస్తాను. ఓర్మిపట్టు!" అని కోరాడు. తొందరగా యమదర్శనానికి వెళ్ళాలంటే పుష్పక విమానం అవసరమే కనుక స్మరించుకున్నాడు. స్మరణమాత్రంతో పుష్పకం అతని దగ్గరకు రాగలదని ఆనాడే నిర్ణయం జరిగింది. అదే విధంగా నేడు పుష్పకం వచ్చి కోటముందు దిగింది. సాయుధుడై రాముడు పుష్పకమా రోహించాడు.

ఇంతలో ఆకాశవాణి ఇలా పలకనారంభించింది. "రాజా! నీ ప్రజల్లో వర్ణధర్మ విరుద్ధంగా ఒక దోషం జరుగుతోంది. దానిని తొలగిస్తే నీవు కృతకృత్యుడవు కాగలవు!" అంటూ ఆప్తవచనం వినిపించింది. ఆ అధర్మమేమిటో స్వయంగా తెలుసుకుందామని పుష్పక విమానంలోనే దేశం నలుమూలలా వెదకనారంభించాడు. అతనికొక విచిత్రం కనిపించింది. ధూమపానం చేత కన్నులెర్రబడగా, అధోముఖంగా చెట్టుకొమ్మకు వ్రేలాడుతూ తపస్సు చేసుకుంటున్న ఒక అపరిచిత వ్యక్తి కనిపించాడు. వెంటనే అతన్ని చేరి "నీ పేరేమిటి? నీ వంశం ఏమిటి? ఎందుకు నీవీ తపస్సు చేస్తున్నావు?" అని ప్రశ్నించాడు. దాని కతడు "నా పేరు శంబూకుడు. నేను శూద్రవంశం నుంచి వచ్చాను. స్వర్గఫలాన్ని కోరి ఇలా తపస్సు చేస్తున్నాను" అని సమాధానం చెప్పాడు.

అతడు తనకు అధికారం లేని తపస్సు చేస్తున్నాడు. దాని వల్లనే ప్రజలకు అరిష్టాలు జరుగుతున్నాయి అని రాముడు వెంటనే గ్రహించాడు. శంబూకుని శిరచ్ఛేదం ద్వారా ప్రాయశ్చిత్తం కలిగిస్తే తప్ప, ఈ అరిష్టాలు తొలగవు అని కూడా నిశ్చయించుకున్నాడు. వెంటనే ఖడ్గం దూసి అతని తలను మొండేనికి దూరం చేశాడు. ఎవడైనా అధర్మం ఆచరించినపుడు రాజే స్వయంగా శిరచ్ఛేదం చేస్తే - వాని ఆత్మ స్వర్గానికే పోతుందని మనుధర్మశాస్త్రం నిర్వచించింది. ఆ విధంగా ధర్మ విప్లవానికి శిక్షింపబడటం వల్ల శంబూకుడు స్వర్గానికి పోయినట్లు కాళిదాసు వివరించాడు. (అయితే ఇక్కడ ఒక సంశయం. మనుధర్మ శాస్త్రం కాళిదాసు కాలానికి వచ్చింది సరే - కానీ, కృతయుగంలో రాముని కాలానికి రాలేదు కదా? అపుడు మనుధర్మశాస్త్ర ప్రమాణంతో రాముడు శంబూకవధ చేయడంలో ధర్మమేమిటి?)

రాముడు తిరిగి వస్తున్నాడు. అగస్త్యముని ఆశ్రమం దారిలో కనిపించింది. ఆ మహర్షి తపోమహిమలో తేజోవిదగ్ధుడై భాసిస్తున్నవాడు. ఆయన్ని చూడాలన్న కోర్కెతో పుష్పకం దింపాడు. ఆయన ఆశ్రమం - పుష్పగంధి! రాముడా శరత్కాల చంద్రునివలె ప్రసన్నుడు. అగస్త్యుని కలుసుకుని, సభక్తికంగా నమస్కరించాడు. కాలకేయులనే రాక్షసులు - సముద్రంలో దాగి, ప్రజలను పీడిస్తున్న సమయంలో వారిని బయట పెట్టుటకుగాను, అగస్త్యుడా సముద్ర జలమునంతా ఆపోశనపట్టాడు. రాక్షస వధానంతరం - తన జలాన్ని తనకిమ్మని సముద్రుడు కోరగా తిరిగి ఇచ్చివేశాడు. అందుకు బహుమతిగా సముద్రుడా మహర్షికి రత్నభూషణ మిచ్చాడు. దానినిప్పుడు రాముని కాయన బహూకరించాడు.

శంబూకవధ ధర్మ కార్యమేనని దేవర్షి అభినందించాడు. రాముడు ఆ రత్నభూషణాన్ని ధరించలేదు. మైథిలీ కంఠాలింగనానికి నోచుకోని తన చేతులకు భూషణములేల యన్న విచారంతో చేత్తో మాత్రం పట్టుకున్నాడు. అగస్త్యుని అనుమతి గ్రహించి, అయోధ్యకు తిరిగి బయలుదేరాడు రాముడు.

రాముడు తిరిగి వచ్చేసరికే విప్రకుమారుడు నిద్రనుంచి లేచినవానివలె లేచి ఉన్నాడు. తిరిగి బ్రతికిన కుమారుని చూసుకొని, విప్రుడు ఆనందిస్తూ రాముని చూసి ఇలా అన్నాడు : "పుత్రవియోగ దుఃఖంతో నేను అనరాని మాటలన్నాను. ఏవో నిందలు వేశాను. నన్ను క్షమించు ప్రభూ!" అంటూ నమస్కరించాడు. తన ధర్మపాలనలో యముడు సైతం అస్తవ్యస్తంగా సంచరించలేడని నిరూపించగల్గినందుకు రాముడానందించాడు. బ్రాహ్మణుడానందంతో తిరిగి వెళ్ళిపోయాడు.

తన రాజ్య పాలనకు శుభం కలగడానికని రాముడు అశ్వమేధయాగం తలపెట్టాడు. సమంత్రకంగా అశ్వాన్ని విడిచిపెట్టాడు. అది దేశదేశాలు యథేచ్ఛగా తిరుగుతోంది. విభీషణాదులు, సుగ్రీవాదులు, వివిధ దేశాల నరేంద్రులు దానిని చూసి ఆనందించి, వివిధ బహుమానాలు విరివిగా పంపుతున్నారు. మహర్షులంతా ఆహ్వానింపబడి, యజ్ఞ నిర్వహణార్థం అయోధ్యకు తరలివస్తున్నారు. అయోధ్య నగరమంతా అలంకరింపబడింది. ద్వారములన్నీ తోరణాలతో మంగళప్రదంగా మెరుస్తున్నాయి. మునులకు పొలిమేరలలో కుటీరములు నిర్మించి,

నివాసాలు కల్పించారు. వేదపఠనంతో పొలిమేరలు ప్రతిధ్వనిస్తున్నాయి. అయోధ్య నలుదిశలా వినూత్ననాదంతో ప్రతిధ్వనించింది. ఆ వేదధ్వానం వినడానికి అసంఖ్యాకంగా జనం చేరుతూ, ఆవేశం పొందుతున్నారు.

ఏకపత్నీవ్రతుడైన రాముడిపుడు వియోగంలో ఉన్నాడు. భార్య - ప్రక్కన లేనిదే యజ్ఞం చేయరాదు. అందుకని బంగారంతో సీతామూర్తిని శిల్పీకరించారు. సీతా ప్రతిమ సన్నిధిలో యజ్ఞం సాగుతోంది. విభీషణాది రాక్షస జన్ములు రక్షకభటులై యజ్ఞ రక్షణ చేస్తున్నారు.

అంతలో వాల్మీకి ప్రేరణతో కుశలవులు - ఆయన రచించిన రామాయణ కావ్యాన్ని గానం చేయటానికి అయోధ్యానగరం చేరుకున్నారు. ఆ బాలుర మధుర గానంతో పేటలు రేగుతున్నాయి. కావ్య వస్తువా - కొత్తది. గుణోత్తముడగు శ్రీరామ ప్రభువుది. బాలురా - హృద్యంగా గానం చేస్తున్నారు. కిన్నెర కంఠస్వరాలతో ఆలాపిస్తున్నారు. శ్రోతలు ఓ హరిసాహరిగా ఆకర్షితులవుతున్నారు. ఆ యువకుల రూపాలు సైతం ఎంతో ఆకర్షణీయంగా ఉన్నాయి. వారి గానమా - శ్రోతలను పరవశింపచేస్తోంది. ఆ ఉత్తమ గానం గురించి నగరంలో ప్రజలు విరివిగా చెప్పుకో నారంభించారు. ఏనోట విన్నా - అదే మాట! విశేషంగా పొగడ్తలు బయల్దేరాయి. చివరకవి రాజప్రాసాదానికి సైతం చేరాయి. రామునికి సైతం తెలిశాయి. రాముడాగలేక అనుజులతో బయలుదేరి మారుమూల పేటలో గానం జరుగుతుండగా వెళ్ళి విననారంభించాడు. సభ యావత్తూ నిశ్చలంగా మైమరచింది. శ్రోతలు ఆనందాశ్రువులు కురుస్తున్నారు. ప్రాతఃకాలంలో హిమబిందువులు రాలుస్తూన్న నిశ్చల వనస్థలిలా శోభిస్తోందా సభ!

పొట్టి, పొడుగులలో తప్ప ఆ అన్నతమ్ముల అందంలో విభేదం కనిపించడం లేదు. భిన్న వస్త్రధారణం వల్ల తప్పితే ఆ అన్నదమ్ములలో తేడా ఏమీ తెలియడం లేదు. ఆ కుశ లవు లిరువురికీ, రామునితోగల పోలికలు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. శ్రోతృజనం అటు రాముని, ఇటు కుశలవులను రెప్పమూయక, మార్చి మార్చి చూస్తున్నారు. యువకుల మధురతర గానానికి ఆనందించి, రాముడా యువకులను ప్రేమతో సత్కరించ, దగ్గరకు పిలిచాడు. వారు సమీపించి, వినయంగా "మాకెట్టి బహుమతులూ అక్కరలేదు. దానము లేవీ మేము పరిగ్రహించజాలము". అంటూ స్పష్టం చేశారు. ఈ మాటవిని జనం మరీ విస్తుపోయారు.

పరివారంచేత అడిగించకుండా రాముడు ఆ యువకులపై అభిమానం రేకెత్తగా ఇలా అడిగాడు "మీకీగానం ఎవరు నేర్పాతు? మీరు గానం చేస్తున్న కావ్యం ఎవరు రచించారు? అని.

"మాకీగానం నేర్పింది వాల్మీకి మహర్షి! ఆయనే ఈ కావ్యాన్ని రచించినవారు!" అని కుశలవులు చెప్పారు.

తమ్ములతో కలసి రాముడిదివరలో వాల్మీకి వద్దకు వెళ్ళినపుడు తన సర్వరాజ్యాన్నీ ఆ మహర్షికి సమర్పించాడు. కేవలం శరీరం మాత్రమే తనకి ఉంచుకున్నాడు. అట్టి మహర్షి ఇన్నాళ్ళకు మళ్ళీ ఈ సందర్భంలో ప్రత్యక్షమయ్యాడు ''రామా! ఈ కుమారులెవరనుకుంటున్నావు? నీ పుత్రులేనయ్యా! వీరిని, వీరితల్లి సీతను స్వీకరించు!" అన్నాడు ఆజ్ఞాపూర్వకంగా! వాల్మీకికి రాముడు ఆదరపూర్వకంగా నమస్కరించాడు. ఇలా అన్నాడు "తండ్రీ

నీ కోడలు సీత మా కండ్లముందే అగ్ని ప్రవేశ మొనర్చి పునీతగా అలనాడు విచ్చేసింది. ఆ అగ్నిహోత్రుడామెను పరమ పవిత్రగా నిశ్చయించాడు. ఆమెపట్ల మాకు సంపూర్ణ విశ్వాసం ఉంది. కానీ, ఆ దుర్మార్గుడైన రావణుని వద్ద ఉండి రావడంవల్ల అయోధ్యవాసులైన ప్రజలు ఆమెను విశ్వసించడంలేదు. నేనేమి చెయ్యగలనో సెలవివ్వండి!" అన్నాడు. తిరిగి రాముడే "మీ రాజ్ఞాపిస్తే స్వీకరించగలను. కానీ సీత దోషరహితగా ప్రజలను నమ్మించాలి" అంటూ పునరుద్ఘాటించడు.

రాముడీ విధంగా వాగ్దానం చేయడంతో వాల్మీకి సంతుష్టుడయ్యాడు. శిష్యులను తన ఆశ్రమానికి పంపాడు. సీతను తెప్పించాడు.

తన మాటను వాల్మీకి ఆమోదించటంవల్ల రాముడు - నగరవాసులందర్నీ ఒకచోటకు చేరవలసిందిగా కబురు చేశాడు. సకల సంస్కారాలకు ఆదిమంత్రమైన - గాయత్రీ మంత్రం చేత సూర్యుని ఉపాసించే విధంగా సీతతోనూ, ఆమె పుత్రులతోనూ వాల్మీకి రాముని దర్శించాడు. కాషాయ రంగుగల వస్త్రాన్ని కప్పుకొని, సీత ఆగమిస్తోంది. ఆమె తన చూపులను రాముని పాదములపైన నిలిపింది. ప్రసన్నంగా ఉంది. ఆమె దేహయష్టి పరిశుద్ధంగా మెరుస్తోంది. చూపరులందరికీ ఆమె పవిత్రురాలే అని వ్యక్తమౌతుంది. తలలు వంచిన వరిమొక్కలవలె సీతను చూస్తూ ప్రజలు - తలలు ఒంచుకున్నారు. ఆమె వస్తున్న మార్గంవైపే చూస్తూ నిలుచున్నారు.

అయోధ్యా ప్రజానీకమంతా సమావేశమైన ఆ సభలో వాల్మీకి ఒక పవిత్రాసనంపై కూర్చున్నారు. సీతతో ఆయన ఇలా అన్నారు. 'అమ్మాయీ! నీ భర్త ఎదుట, ఈ సకల ప్రజానీకం ఎదుట - వీరికి గల సందేహాలు తొలగించవమ్మా! అని శాసించారు.

మహర్షి శాసనాన్ని సీత శిరసా వహించింది. ముని శిష్యుడు ఆమె చేతిలో పవిత్రజలం పోశాడు. ఆమె ఆచమనం చేసింది. తన హృదయమును ఆవిష్కరిస్తూ సత్యవచనాలు ఇలా పలికింది. "అమ్మా భూదేవీ! నా భర్త విషయంలో త్రికరణశుద్ధితో మెలిగేననీ, ఏ విధమైన అతిక్రమణలూ సలుపలేదనీ, నీవు ఆమోదిస్తే వచ్చి నన్ను నీ గర్భంలోకి తీసుకో తల్లీ!" అంటూ ప్రార్థించింది.

తక్షణమే భూమిలో పెద్ద రంధ్రమేర్పడింది. మెరుపుకాంతుల ప్రభామండలం పైకి వచ్చింది. ఆ ప్రభామండలం నుండి ఆదిశేషుడు లేచివచ్చాడు. అతని ఫణాగ్రంపై ఒక దివ్య సింహాసనం ఉంది. ఆ సింహాసనంపై భూదేవతామూర్తి ఆశీనమై అందరికీ దర్శనమిచ్చింది.

"అమ్మా సీతా! రా!" అంటూ భూమాత సీతనందుకొని తన తొడపై కూర్చోపెట్టుకుంది. రాముడు ఆర్తనాదంతో రోదిస్తున్నాడు "వద్దు! వద్దు" అని మొరపెట్టుకుంటున్నాడు. అతని మొరలామె ఆలించలేదు. కనురెప్పపాటులో ఆమెను తీసుకొని పాతాళ లోకమునకు తిరిగి వెళ్ళిపోయింది భూమాత.

ఆవిధంగా భూదేవి సీతను తీసుకొనిపోవడంతో రాముడు విపరీతంగా కంపితుడయ్యాడు. తన సీతను తెచ్చి తన కప్పగించమంటూ రాముడు ధనుస్సు ఎక్కుపెట్టాడు భూమికి గురిచేసిన బాణం అఘాతం కల్పించడానికి సిద్ధంగా ఉంది. వెంటనే వాల్మీకి మహర్షి వారించాడు. "విధివిలాసం ఇలా ఉండగా ఎవరు తప్పించగలరు నాయనా?" అంటూ ఆయన ఓదార్చాడు.

రాముడు శాంతించాడు. యజ్ఞానికి ఆహ్వానించబడిన ఋత్విజ్ఞులను, బంధుమిత్రులను సత్కరించాడు. కుశలవులనిద్దరినీ సీత తనకిచ్చిన కానుకలుగా సంగ్రహించి, వారికి రాజ్య పట్టాభిషేకం చేశాడు.

భరతుని మేనమామ యుధాజిత్తు భరతునికొక ప్రత్యేక రాజ్యమిచ్చి అతన్ని పాలకునిగా ఏర్పరచమని కబురు చేశాడు. ఆమాట ప్రకారం వెంటనే రాముడు రాజ్యపాలనకు అవసరమైన వస్తువాహనాదులను ఏర్పాటుచేస్తూ సింధుదేశానికి అధీశునిగా ఏర్పరచాడు. భరతుడూ రాజ్యాన్ని పరిశీలించ బయల్దేరాడు. సపరివారంగా సింధుదేశం చేరుకున్నాడు. కానీ, అక్కడ నివసిస్తున్న గంధర్వజాతివారు ఎదుర్కొన్నారు. యుద్ధం జరపవలసి వచ్చింది. వారందర్నీ ఓడించాడు. శాంతిని నెలకొల్పాడు. వారి కభీష్టదాయకమైన సంగీతకళను పెంపొందించుకోవలసిందిగా, గొప్ప వీణావాదకులు కావలసిందిగా పురోగమించమనీ, అట్టి కళాకారులందరినీ తన సంస్థానం పోషించగలదనీ ప్రకటించాడు. గంధర్వులు ఆయుధాలు విసర్జించి, సంగీత ప్రియులయ్యారు. భరతుడు సింధు దేశంలో సుస్థిరమైన రాజ్యాన్ని నెలకొల్పాడు. యుక్తవయస్కులైన తన కుమారులు తక్షక, పుష్కలలకు రెండు రాజ్యాలు ఇచ్చి పట్టాభిషేకం చేశాడు వారి నాయధేయాలననుసరించి, తక్షశిల, పుష్కలారక నగర రాజ్యాలు అభివృద్ధి గాంచాయి. భరతుడు అన్నయగు రాముని విడిచి, ఉండలేక కుమారులకు చెప్పవలసిన సంగతులన్నీ చెప్పి తిరిగి అయోధ్యకు వెళ్ళిపోయాడు

లక్ష్మణుడు కూడా అన్నగారి ఆజ్ఞతో తన కుమారులైన అంగద - చంద్రకేతులకు కారాపదం అనే దేశాన్ని విడదీసి రాజ్యంగా రూపొందించి, ప్రభువులుగా పట్టాభిషేకం చేశాడు.

అయోధ్యరాజ్య సింహాసనాన్ని సీతారామసుతులైన - కుశలవులు పట్టాభిషిక్తులై పాలించనారంభించారు. వారికి, రామలక్ష్మణ, భరత శత్రుఘ్నులు బాసటగా నిలిచి సహకరిస్తున్నారు. ఇంతలో కౌశల్య, సుమిత్ర, కైకేయిలు ముగ్గురూ వయోభారం వల్ల స్వర్గస్థులయ్యారు. రామాదులు శ్రాద్ధ తర్పణాదులొనర్చి అంత్యక్రియలు నిర్వర్తించారు.

కొంతకాలం సుఖంగా గడిచిపోయింది. ఒకనాటి రాత్రి రాముడు తన శయనాగారం ప్రవేశించాడు. తలుపులు వేసుకొన్నాడు. ఏకాంతంగా నిద్రకుపక్రమించాడు. వేసి ఉన్న తలుపులన్నీ వేసే ఉన్నాయి. మరి ఎలా ప్రవేశించాడో తెలియదు.ఒక వ్యక్తి మునివేషంలో ప్రవేశించాడు. రాముడ్ని లేపాడు "నీకు ఒక రహస్యం చెప్పడానికి వచ్చాను. మన రహస్య సంభాషణ ఇతరులెవ్వరూ వినరాదు. ఆకట్టుదిట్టం చేసిరా!" అన్నాడు. ఈ ఆగంతక వ్యక్తి ఎవరో? ఎలా వచ్చాడో తెలియక రాముడు ఆశ్చర్యం పొందాడు. బయటకు వెళ్ళాడు. లక్షణుని పిలిచాడు. అతన్ని "ఎవరూ నాదగ్గరకు రాకుండా జాగ్రత్తగా చూడు"అని ఆజ్ఞాపించాడు.

లోపలికివచ్చి ఆమునివేషధారిని సమీపించాడు "చెప్పండి ఇక ఎవరూ ఇక్కడకు రారు!" అన్నాడు.

"నేను యమధర్మరాజుని, బ్రహ్మ ఆజ్ఞ నీకు తెలుపడానికే వచ్చాను. నీవింక ఈమానుషజన్మ చాలించాలి. వెంటనే స్వర్గానికి వెళ్ళాలి. ఆ అవసరం చాలావుంది! అని చెప్పాడు.

యముడు రామునితో సంభాషిస్తున్న సమయంలో దూర్వాస మహాముని రాముని దర్శనార్థం వచ్చాడు. లక్షణుడాయనను ద్వారంకడనే ఆపుచేశాడు. కానీ, సత్వరం ఆయన్ని దర్శించాలంటూ దుర్వాసుడు రాముని శయనాగారం ప్రవేశించబోయాడు. యముడు కోపించాడు నియమభంగంచేసిన వ్యక్తి ఎవరైనా, తక్షణం విసర్జించవలసిందేనని ఆజ్ఞాపించాడు. ఆమ ట -తమ్ముడ్ని పిలిచి చెప్పాడు రాముడు. లక్ష్మణుడు సరయూనదీ తీరానికి వెళ్ళి యోగమార్గంలో శరీరాన్ని పరిత్యజించాడు. అతను ఆదిశేషుని అవతారం. ఆదిశేషుడే - పతంజలి అవతారంతో యోగశాస్త్రం విరచించాడు. కనక లక్ష్మణునికా విద్యలో పరిపూర్ణత్వం ఉందని, కాళిదాసు వివరించాడు. విష్ణ్వాంశ నాలుగంగములతో అవతరించింది. అందులో ప్రధానాంశ - ముందుగా స్వర్గానికి చేరింది.

అప్పుడు ధర్మదేవతకు ఒకకాలు లేకుండాపోయింది. కనుకనే త్రేతాయుగంలో ధర్మం త్రిపాత్తుగా చెప్పబడింది.

కుశుడు కుశావతీ నగరానికి బయలుదేరాడు. దానికతడే అధిపతి. లవుడు చరావతీ నగరానికి అధిపతిగా నియమింపబడ్డాడు. తన తమ్ములతో పురజన శ్రేష్టులతోను, రాముడు ఆత్మీయంగా మాట్లాడాడు. తనయందు ప్రేమతో ఎవరైనా తనను అనుసరించ వచ్చునని చెప్పాడు.

"నేను మహాప్రస్థానానికి సంసిద్ధమవుతున్నాను. సిరిసంపదలను, రాజ్యాన్ని ఇక్కడే విడిచి పెడుతున్నాను. కనుక నాతో రాదలచిన వారంతా సరయూనదీ తీరానికి సాయం సమయంలో రావలసింది" అని చెప్పాడు.

రాముని హృదయ మెరిగిన కపి, రాక్షస, మానవవీరులంతా దుఃఖించనారంభించారు. ప్రజానీకం కురుస్తున్న దుఃఖాశ్రువులతో రాజమార్గాలన్నీ తడిసిపోతున్నాయి. రాముడు బయలు దేరుతున్నాడని తెలిసి పుష్పకవిమానం వచ్చింది. దానితో తనకు పనిలేదని చెప్పివెనక్కు పంపించేశాడు. తన ప్రియమిత్రులతోను, జన పరివారంతోను, నడిచే వెళ్ళడానికి నిశ్చయించినట్లు చెప్పాడు.

సాయం సమయం సమీపిస్తున్నది. రాముడు సరయూనదీ తీరానికి పయనమయ్యాడు. వెనుకగా భరత శత్రుఘ్నులు అనుసరించారు. సరయూనది నిచ్చెనలా భాసించింది. రాముని ఆదేశానుసారం కపులు, రాక్షసులు, ప్రజలు - సమ్మర్దంగా ఆవులమందవలె నదీ తీరానికి వచ్చారు. గ్రీష్మనిదాఘ తాపంతో ధప్పిగొన్న తెల్లని ఆవులమంద, చల్లని ఉదకాన్ని చూడగానే ఆవేశంతో నదిలోని కురికినట్లుగా అందరూ సరయూ నదిలోనికి దుమికారు. దేవతల కోరికపై అవతరించిన మహావిష్ణువు - తన కర్తవ్యం నెరవేర్చుకున్నాడు. ఉత్తరాన హిమగిరిపై విభీషణుడు, దక్షిణ దూరస్థలిలో చిత్రకూట పర్వతంపై హనుమంతుడూ చిరంజీవులుగా, తన శాశ్వాతధ్వజాలుగా నిలిపాడు రాముడు. అఖిల సృష్టికీ ఆధారభూతమైన స్వస్వరూపంతో స్వర్గలోకం ప్రవేశించాడు. ఆయనతోపాటు పరివారం అంతా సూక్ష్మ రూపాలతో స్వర్గానికి వెళ్ళారు!

ఆ విధంగా రామకథ ముగించాడు మహాకవి.